శ్రీ

# ఆంధ్ర - విక్రమోర్వశీయనాటకము

కాళిదాస సంస్కృతనాటకమున కనువాదము.



వేదము వేంకటరాయశాస్త్రి ప్రణీతము.






ప్రథమ ముద్రణము.

చెన్నపురి:

'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.

1921.



వెల 12 అణాలు.

# విజ్ఞప్తి.

కడచినవత్సరము జూలై మొదలు ఆముక్తమాల్యదకు తత్పూర్వలిఖితావశిష్టమైన టీకను వ్రాయుచుంటిని. అది నవంబరులో సమాప్తిం జెందినది. అందులకైన పరిక్లేశమువలన అనారోగ్యము పైకొనినది. తత్సహనోపాయముగా డిసెంబరు జనవరినెలలలో రత్నావళీవిక్రమోర్వశీయములను ఆంధ్రీకరించితిని.

ఆవృత్తాంతమును—పూర్వము మదీయమాళవికకు ముద్రణవ్యయము నొసంగినవారు కావ్యనాటకాదివాఙ్మయరసజ్ఞశిఖామణులు విడవలూరుగ్రామవాస్తవ్యులు పంటకులవతంసులు సదాచారధురంధరులు

నెల్లూరిలో నిధిపతులు

## శ్రీయుత-దొడ్ల రామిరెడ్డిగారు

విని, అత్యంతప్రీత్యుత్సాహములతో ఏతత్ప్రచనంగూర్చి తమయభినందనముం దెలుపుచు ఏతద్గ్రంథద్వయముద్రణమునకు పర్యాప్తమైనధనమును నాకుం బంపినారు.

శ్రీరామిరెడ్డిగారు 20 ఏండ్లకుముందు విక్రమోర్వశీయము నాంధ్రీకరింపుమని నన్ను హెచ్చరించిరి. వారి యాయీప్సితము నావలన ఇప్పటికి నెఱవేఱినది.

నాదు ప్రజ్ఞారిక్తగ్రథనమునకు ముద్రణార్థము అప్రార్థితముగా తోడ్పడినట్టి యీసరస్వతీసరస్వత్పుత్త్రీలాలితునికి అత్యంతకృతజ్ఞుఁడను.

ఆయత్తాకోడండ్రిరువురును శ్రీరెడ్డిగారికి విద్యకన్న ఐశ్వర్యమును ఐశ్వర్యముకన్న విద్యను పోటీలుమెఱసి యొసంగుచుందురుగాక.

అక్టోబరు, 1921 మదరాసు.

వే. వేంకటరాయశాస్త్రి.

## సవరణ :—

16 వ పుటలో ౩౧ వ పద్యమునకుఁ బూర్వము.—

“రాజు.—ఏమి ! ఓదార్పనియా వచించెదవు? ”

అని పఠించుకొనవలయును.

| పుట | పద్యము | అసాధువు | సాధువు |
|---|---|---|---|
| 5 | ౮ | మతిఁడేయ | మగునయ్య |
| 9 | ౧౭ | తే. | ఆ. |
| 26 | ౪౮ | తే. | ఆ. |
| ” | ౪౯ | తే. | క. |

# విక్రమోర్వశీయమందలి పాత్రములు.

---

## పురుషులు.

* సూత్రధారుఁడు.

* పారిపార్శ్వకుఁడు.

పురూరవుఁడు.—కథానాయకుఁడు.

మాణవకుఁడు.—విదూషకుఁడు.

చిత్రరథుఁడు.—గంధర్వరాజు.

ఆయువు.—పురూరవునికుమారుఁడు.

నారదుఁడు.—దేవర్షి.

లాతవ్యుఁడు.—కంచుకి.

వేధకుఁడు.—వేఁటకాఁడు.

పైలవుఁడు, గాలవుఁడు.—భరతశిష్యులు.

## స్త్రీలు.

ఉర్వశి.—కథానాయిక.

చిత్రలేఖ, సహజన్య, రంభ, మేనక.—ఉర్వశిసకియలు, అచ్చరలు.

ఔశీనరి.—పురూరవునిపట్టమహిషి.

నిపుణిక.—ఔశీనరిచేటి.

తాపసి.—చ్యవనాశ్రమగత.

యవని.—శస్త్రధారిణి.

---

శ్రీ

# ఆంధ్ర-విక్రమోర్వశీయము.

---

శా. ఏనిం జాటును రోదసీభరితుఁ డౌనేకాత్ము వేదాంత, మె
వ్వానిం జెందెడి నీశ్వరాఖ్య యితరాప్రాప్తంబు సార్థార్థమై,
ధ్యానింతు ర్మును లెవ్వనిన్ నియమితప్రాణాదులై ముక్తికై,
తా నిశ్శ్రేయస మిద్ధభక్తివశుఁ డాస్థాణుండు మీ కిచ్చుతన్. ౧

---

## ప్రస్తావన.

నాంద్యంతమున

సూత్రధారుఁడు—అతివిస్తరము వలదు. [నేపథ్యమువైపు చూచి] మారిషా, ఇటు రావోయి.

[పారిపార్శ్వకుఁడు ప్రవేశించును.]

పారిపార్శ్వకుఁడు—వచ్చితిని బావా.

సూత్ర.—మారిషా, ఈసభవారు పూర్వకవుల ప్రయోగబంధములను పెల్లుగా చిత్తగించి యున్నారు, కావున, నే నిపుడు విక్రమోర్వశీయ మనెడి యపూర్వనాటకమును ప్రయోగించెదను. అందులకై పాత్రవర్గమును తమతమపాఠములయందు అప్రమత్తులుగా సిద్ధపడవలసిన దని హెచ్చరింపుము.

పారి.—బావ యాజ్ఞాపించినట్లు. [అని నిష్క్రమించును.

సూత్ర.—ఇదె యిపుడు ఆర్యమిశ్రులకు విన్నవించుకొనుచున్నాను. [ప్రణమిల్లి]

తే. ప్రణయవంతులమీఁదిదక్షిణత నేని,
వస్తుపురుషులపై గౌరవమున నేని,
అవధరింపుఁడీ సావధానాత్ము లగుచుఁ,
గాళిదాసగ్రథితరూపకమును దీని. ౨

[నేపథ్యమున]

కాఁపరయ్యా కాపరయ్యా! వేల్పులమీద పక్షపాతం గలవాడుగాని, ఆకాశగమనం గలవాడుగాని, కలఁడేని.

సూత్ర.—[చెవి యొగ్గి] ఏమి యిది! నేను విన్నపము చేసికొన్న వెంటనే గొరవంకకొమ్మలదియుం బోలె ఆకసమునుండి నాదము వినఁబడుచున్నది! [ఆలోచించి] కాని, తెలిసినది:—

తే. నరసఖమునీంద్రునూరుజ నాకరమణి
విత్తపునిప్రోల *నాడి నివృత్తి యగుడు,
నర్ధపథమున నమరారు లాఁకఁగొనఁగ,
శరణుకై కుయి వెట్టు నచ్చరలగణము. 3

[అని నిష్క్రమించును.

ప్రస్తావన ముగిసినది.

---

*అడి - "కైలాసనాథ ముపసృత్య" అని పా. మదూహితము.

# ప్రథమాంకము.

---

[అంతట అప్సరసలు ప్రవేశింతురు.]

అందఱు.—కావరయ్యా కావరయ్యా! వేల్పులమీద పక్షపాతంగలవాడుగాని, ఆకాశగమనం గలవాడుగాని, కలడేని.

[అంతట రథముచేత రాజును సారథియు (అపటీక్షేపమున) ప్రవేశింతురు.]

రాజు.—మొఱ యిడవలదు, మొఱ యిడవలదు! సూర్యోపస్థానమునుండి మరలిననన్ను పురూరవునిఁ దెలియుఁడు; ఎందువలననుండి మిమ్ముఁ గావవలయునో చెప్పుఁడు.

రంభ.—అసురదర్పమునుంచి.

రాజు.—ఏమీ! అసురదర్పము మీకు ఎగ్గుచేసినదా ?

మేనక.—అవధారు మహారాజా. ఎవతె తపోవిశేషపరిశంకితుడైన మహేంద్రునికి కోమలాయుధమో, రూపగర్వితయైన శ్రీకి గుండెతల్లడమో, స్వర్గానికి అలంకారమో, ఆ మా ప్రియసఖిని ఊర్వశిని కుబేరాస్థానినుంచి మరల వస్తూవున్నదాన్ని చిత్రలేఖాద్వితీయను హిరణ్యపురవాసి కేశి యనేదానవుడు అకస్మికంగా చూచి చెఱబట్టుకొనిపోయినాడు.

రాజు.—ఆజాల్ముఁడు ఏదిగ్విభాగమువైపు పోయినాఁడో ఎఱుఁగుదురా ?

సహజన్య.—పూర్వోత్తరంవైపు.

రాజు.—అటయిన దిగులు మానుఁడు. మీసకిని తెచ్చుటకు యత్నించెదను.

అప్సరలు.—సోమునినుంచి ఒకటే ఎడమువాడవైనవియందిదేమియాశ్చర్యం?

రాజు.—నన్ను మీరు ఎచట ఎదురుచూచుచుండెదరు ?

అచ్చరలు.—ఇదె యీ హేమకూటశిఖరముమీద.

రాజు.—సూతుఁడా ! ఈశానదిక్కునకు గుఱ్ఱములను వడి గొలుపుము.

సూతుఁడు.—ఆయుష్మంతునియాజ్ఞ. [అని అట్లు చేయును.

రాజు.—[రథవేగమును రూపించి] బళిబళి ! తేరుపోవుచున్నయీ వేగముచేత నేను ముందు తరలుగరుత్మంతుని నయితము కలసికొనఁగలను. మఱి యీ యింద్రాపకారిమాట చెప్పవలయునా ? అట్లే గదా—

చ. పొడిపొడి యైచుఁ జేరిమును పోవు దుమారము వోలె మేఘముల్,
అడరెడినో యరిభ్రమి నరాంతరపంక్తి యరాంతరంబులన్,

నిడివిగఁ జిత్రముల్బలె వినిశ్చలముల్ హయమాళి చామరల్,
పడగ చెలంగు యష్టితుదిఁ బ్రాంతమునఁ సరి గాలితీవ్రతఁ. ४

[రథములో రాజును సూతుఁడును నిష్క్రమింతురు.

రంభ.—ఒసే, ఆరాజర్షి వెళ్లినాడు. ఆ నిర్దిష్టప్రదేశానికే పోదాము రండి.

ఇతరలు.—సఖి, అట్లే చేతాము.

[అని అందఱు శైల మెక్కుట నభినయించి నిలుతురు.

రంభ.—ఆరాజర్షి మనహృదయశల్యాన్ని వెలుపరించునా ?

మేనక.—నీ కేల సంశయం ? పోరు ఆసన్నమయినప్పుడు మహేంద్రుడు మధ్యమలోకంనుంచి ఈయననే సగౌరవంగా రప్పించి విజయసేనమొనలో నియోగిస్తాడు గదా.

రంభ.—తప్పకుండా యిప్పుడు విజయం పొందును గాక.

సహ.—[క్షణమాత్ర ముండి] ఓసీ, ఊఱడిల్లండి ఊఱడిల్లండి. ఇదుగో నిగుడుతున్న లేడిజెండాలోటిది ఆరాజర్షిరథము సోమదత్తము కనబడుతున్నది. అతడు పోయినపని సాధించక మరలడు గదా.

[అందఱు పైకి కన్ను లెత్తి చూచుచున్నారు.

[అంతట రాజు, సూతుఁడును, చిత్రలేఖావలంబితహస్త భయనిమీలితాక్షి ఉర్వశియు ప్రవేశింతురు.]

చిత్రలేఖ.—ఊఱడిల్లు ఊఱడిల్లు ప్రియసఖీ.

రాజు.—

తే. తొలఁగె భీరుక,సురరిపులనిభయము,
వజ్రిమహిమ జగత్త్రయావనము గాదె?
కానఁ దెఱవు వెడంద యాక్షాలుగన్ను,
నళిని ప్రత్యూషమున నుహాోత్పలముఁ బోలె. ౫

చిత్ర.—అయ్యో! ఉచ్ఛ్వాసమాత్రమే జీవచిహ్నంగా వున్నది! ఈమెకు ఇంకనూ చైతన్యం రాకున్నది!

రాజు.—మీసకి బిట్టు బెగ్గడిల్లినది. అట్లే గదా-

క. విడువదు యిప్పటికి నదరు
పడఁతియెదను గుసుమసదృశబంధనమును, దె
ల్పెడి స్తనమధ్యోచ్ఛ్వాసిత
నడరెడుహరిచందనద్రవాంకము దీనిఁ. ౬

చిత్ర.—ఓసీ మనస్సు నిబ్బరంచేసుకోవే, అచ్చరలాగ తోచకున్నావే!

[ఉర్వశి తెలివి పొందును.

రాజు.—కోమలీ, నీ చెలి మూర్ఛఁదేరుచున్నది. చూడు-

తే. శశి పొడువఁ జీకటి యడంగు నిశయుఁ బోలె,
సాంద్రధూమం బఱునిశాగ్నిజ్వాల వోలె,
లోనిమూర్ఛ యెడలుచుండఁ జాన దోఁచు
గట్టురిలినఁ గలఁగి తేరు గంగ వోలె. 8

చిత్ర.—సకీ, దిగులు మానవే. ఆవేల్పులపగతురు హతాశులుం పరాహతులైనారుగదా.

ఉర్వశి.—[కన్నులు తెఱచి] మహేంద్రుడేమయినా తనప్రభావాన్ని చూపించినాడా!

చిత్ర.—మహేంద్రుడు గాడు, మహేంద్రునితో సమానుడైనయీరాజర్షి.

ఉర్వశి.—[తన్నుం జూచుకొని, ఆత్మగతము] దానవులుం నాకు ఉపకారం చేసినారు సుమా.

రాజు.—[ప్రకృతిస్థను ఉర్వశిని నిర్వర్ణించి, స్వగతము] అచ్చర లందఱును నారాయణఋషిని వలపింప వచ్చి అతనితొడనుండి జనించినయీరమణిని గాంచి సిగ్గు చెందుట యుక్తమే సుమా. అట్లన నేల, ఈరూపము తాపసునిసృష్టి యనఁ దగినది గాదు. అట్లే గదా—

ఉ. పైదలిఁ జేయ నయ్యె విధి ప్రాప్తమహోజ్జ్వలకాంతి చంద్రుఁడో?
ఆదిరసైకకంద మతఁడే యసమాస్త్రుఁడో? పుష్పమాసమో?
వేదజడుండు ప్రాఁదపసి వీతసమస్తకుతూహలుం డెటుల్
శ్రీ దొలఁకన్ మనోహరముఁ జేయఁగ నేర్చెడి నిట్టిరూపముల్? 9

ఉర్వశి.—చెలీ, ఆ సఖీజనము ఎక్కడ ఉండును.

చిత్ర.—అభయ మిచ్చినమహారాజె తెలుగును.

రాజు.—[ఉర్వశిని గాంచుచు] మిక్కుటపుదిగులులో నున్నది. నీవే యూహింపుము.

తే. స్వైరముగ నీవు భామ, యవంధ్య మైన
మెవనికనుమ్రోల నొకపరి యేని నిలుతొ,
నిన్నెడయ లేక యాతఁడే నెగులుఁ జెందఁ,
జెలుల స్నేహారసార్ద్రిలఁ జెప్ప నేల?

ఉర్వశి.—[అపవారించి] ఇతనివాక్కు ఎంతసొగసుగా నున్నది! కాకేమి! చంద్రునివల్ల అమృత మన్న ఆశ్చర్య మేమి? [ప్రకాశము] కనుకనే చూడడానికి నా హృదయము తమకపడుతూ ఉన్నది.

రాజు.—[చేతితో చూపుచు]

క. నీమొగముం జూచెద రిదే
కోమలి, నీచెలులు హేమకూటస్థిత లై,
గాముం బాసినరాతిరి
సామిం బ్రత్యాగతప్రసాదుం బోలెన్. ౧౦

[అని ఉర్వశిని సాభిలాషముగాఁ గనును.

చిత్ర.—సఖీ, చూడు.

ఉర్వశి.—[రాజును ఆసతోఁ గాంచుచు] సమదుఃఖతచేత నన్ను కన్నులతో త్రాగుతున్నట్లు తోచేని.

చిత్ర.—[సాకూతముగా] ఎవరు?

ఉర్వశి.—ఇదె ప్రణయిజనము.

రంభ.—[హర్షముతోఁ గాంచి] సఖి, సచిత్రలేఖను ప్రియసఖి నుర్వశిని తోడ కొని విశాఖాసహితుడు భగవంతుడు చంద్రుడువోలె రాజర్షి వచ్చినాడు.

మేనక.—[చూచి] సఖి, మనకు ఇందు రెండు ప్రియములు. మన ప్రియసఖిని ఉర్వశిని తేవడమున్ను, మహారాజు అక్షతశరీరుడుగా రావడమున్ను.

సహజన్య.—సఖి, సరిగా చెప్పితివి. దానవుల్లు దుర్జయులు గదా.

రాజు.—సూతుఁడా, ఇదే ఆకొండశిఖరము, రథమును డిగ్గ నడుపుము.

సూతుఁడు.—ఆయుష్మంతునియాజ్ఞ. [అని ఆట్లే చేయును.

రాజు.—[చక్రోద్ఘాతమును రూపించి, ఆత్మగతము] అహా! రథము విషమముగా కొండమీఁద దిగుట నాకు ఉపకారమే అయినది.

ఆ. తేరికుదుపుచేత నీరథాంగశ్రోణి
రోమవిక్రియాభిరామముగను
అంసమున మదీయ మంసంబు నొరయుట
యించువిల్తుఁ డంకురించుట బలె! ౧౧

ఉర్వశి.—సకి, కొంచె మటు ఓసరిల్లవే.

చిత్ర.—[స్మితను] నాకు శక్యం గాదు.

రంభ.—రండి రాజర్షిని సంభావింతము. [అందరు సమీపింతురు.

రాజు.—

తే. సూత, నిలుపుము రథము నిచ్చోట నిముసము,
ఉత్సుక లగునకులతో సముత్సుకతను,
లతలతోఁ గూడ నార్తవలక్ష్మి వోలె,
నీసుదిరనేత్ర వెండి కూ ర్పెనయుదాఁక. ౧౨

[సూతుఁడు అట్లే చేయును.

రంభాదులు అందఱు.—అహా! మహారాజు విజయముచేత వర్ధిల్లుచున్నాడు!

రాజు.—మీరును మీసఖి వచ్చుటచేత.

ఊర్వశి.—[చిత్రలేఖ కేలూఁత యియ్యఁగా తేరినుండి దిగి] సఖులారా, రండి, నన్ను గాఢంగా కౌగిలించుకోండి; మళ్లీ సఖులముఖాన్ని చూస్తా నన్న ఆశ నాకు లేకపోయింది గదా.

[సత్వరముగా కౌఁగిలించుకొందురు.

రంభ.—తప్పకుండ మహారాజు నూర్లకొలది యేండ్లు భూమిని పాలించు చుండును గాక.

సూతుఁడు.—ఆయుష్మంతుఁడా, తూర్పు దిక్కునుండి మిక్కుటంపురథ వేగంపుశబ్దము వినఁబడుచున్నది.

క. డిగివెడి నెవ్వఁడో యీతఁడు
గగనంబుననుండి తప్తకనకాంగదుఁడై
నిగనిగని మెఱుపు లోలసెడి
జిగిమొగులం బోలె నద్రిశిఖరంబునకున్. ౧౩

[అచ్చరలు చూచుచుందురు.

అచ్చర లందఱు.—అహో! చిత్రరథుడు!

[అంతట చిత్రరథుఁడు ప్రవేశించును.

చిత్రరథుఁడు.—[రాజును గాంచి గౌరవముతో] అహాహా! నీవు మహేంద్రుని ఉపకరించుటకుఁ జాలినపరాక్రమముతో వర్ధిల్లుచున్నావు!

రాజు.—ఓహో! గంధర్వరాజు! [తేరు డిగి] ప్రియమిత్రునికి స్వాగతము.

[ఒండొరులచేతులం గైకొందురు.

చిత్రర.—కేశిదానవుఁడు ఊర్వశిని చెఱఁబట్టినాఁ డని నారదునివలన విని మహేంద్రుఁడు ఆమెను విడిపించుకొని రమ్మని గంధర్వసేనకు ముదలవెట్టినాఁడు. అంతట, మేము మధ్యమార్గమున చారణులవలన నీజయోదాహరణమును విన్నవార మై ఇట నున్ననిన్నుఁ దఱిసితిమి. నీవును ఈమెను నుంచిదుకొని మాతోఁగూడ దేవేం

ద్రుని దర్శించుట తగవు. మహానుభావునికి దేవేంద్రునికి నీవు మహత్తర మయిన ప్రియమును ఆచరించితివి గదా. చూడు,

క. మును పిచ్చెను నారాయణ
 ముని యీయమ్మతోపమాంగిఁ బురుహూతునికిన్,
 దనుజునికయినుండి యొడిచి
 యనుఁగుంజెలి నీ విపుడు సమర్పించితివే. ౧౮

రాజు.—అట్లు గాదు :

తే. అశనిధరు తేజము గదయ్యా యతనిరిపుల
 నతనిపక్షమువారలు హతులఁ జేఁత ;
 భూమిధరకందరంబుల మ్రోఁగునట్టి
 సింగపుం బ్రతిశబ్దంబు చెండుఁ గరుల. ౧౯

చిత్రర.—ఇది యుక్తమే. గర్వము లేమి విక్రమాలంకారము గదా.

రాజు.—సఖుఁడా, నాకు శతక్రతుని దర్శించుటకు ఇది అవసరము గాదు. ఈ మెగారిని నీవు ప్రభువుకడకుం గొనిపొమ్ము.

చిత్ర.—నీవు ఇచ్ఛగించినట్లే. [అచ్చరలనుగూర్చి] ఇటు ఇటు మీరు.

[అచ్చరలు తరలుదురు.

ఊర్వశి.—[జనాంతికము] సఖి, చిత్రలేఖా, ఉపకారియైనను రాజర్షిని ఆమంత్రింప నేరకున్నాను. నీవు నాముఖమవు గమ్ము.

చిత్ర.—[రాజును దరిసి] వయస్యుడా, ఊర్వశి విన్నవిస్తున్నది. 'మహారాజు చేత అనుజ్ఞ పొంది ప్రియసఖిని బోలె మహారాజుకీర్తిని మహేంద్రలోకానికి కొని పోవడానికి కోరుతున్నాను.' అని.

రాజు.—పోవునుగాక, మరల దర్శనమునకు.

[స్త్రీలు అందఱు సగంధర్వులు మింటికెగయుట నభినయింతురు.

ఊర్వశి.—[ఉత్పతనభంగను రూపించి] అహో ! నాయేకావళి తీగకొమ్మకు తగులుకొన్నది. [వెనుకకు మరలి] చిత్రలేఖా, దీన్ని వదిలించు.

చిత్ర.—[చిఱునగవుతో] దిట్టముగా తగులుకొన్నది. వదిలింప నశక్యమని నాకు తోస్తున్నది అయినా యత్నిస్తాను.

ఊర్వశి.—నీ వన్న యీమాట మఱచిపోకు.

[చిత్రలేఖ వదలింపుట నభినయించును.

రాజు.—[స్వగతము]

క. ప్రియ వైతి లతిక, నాకున్,
 బ్రియపయనమునకు నిమేషవిఘ్నము సేఁతన్;

నయనాంతేక్షణఁ గంటిని
బ్రియఁ బరివృత్తార్ధముఖిని వెండియుఁ గాన్క. ౧౬

సూతుఁడు.—ఆయుష్మంతుఁడా,

తే. వాసవునికి నెగ్గు సేసినదైత్యుల
నుప్పుఁగడలిలోన నురలవైచి
మరలఁ జొచ్చె నీదుమారుతాస్త్రము పొదిఁ
గలుఁగునను మహోరగంబుమాడ్కి. ౧౭

రాజు.—పుటి రథమును చేరఁ బట్టు. ఎక్కెదను.

[సూతుఁడు రథమును చేరఁ బట్టును; రాజు నాట్యమున రథమును ఎక్కును; ఊర్వశి రాజును గాంచి నిట్టూర్పుపుచ్చుచు సఖులోఁ గూడ నిష్క్రమించును. చిత్రరథుండును.

రాజు.—ఏమి యిది! దుర్లభమందు తగులుగొల్పుచున్నాఁడు మన్మథుఁడు!

తే. నాయొడలినుండి సుందరి నామనమును
దంష్ట్రిమధ్యమపదముకై తా నిగయుచు
నాఁచికొని రాజహంసి లూనాగ్రమైన
కమలనాళంబునుండి సూత్రమును బోలె. ౧౮

[అందఱు నిష్క్రమింతురు.

---

(ప్రథమద్వితీయాంకముల నడుమ)

ప్ర వే శ క ము.

[అంతట విదూషకుఁడు ప్రవేశించును.]

విదూషకుఁడు.—హీహీహీ! నిమంత్రణైకపరవశు డయినబ్రాహ్మణునిలాగు రాజరహస్యంచేత పైకి పిగులుచున్నవాడనై జనులు నిండిన యీచోట నానాలుకని కట్టివేసుకోలేకున్నాను. కనక ఆయనగారు నాప్రియవయస్యుడు కార్యాసనమునుంచి లేచేదాకా జనసంపాతము తక్కువగా వున్నయీవిమానపరిసరంలో ఉంటాను.

[పరిక్రమించి నిలుచును.

చేటిక.—(ప్రవేశించి) దేవి కాశీరాజుకూతురు నన్ను అజ్ఞాపించింది; "ఓసే నిపుణికా, సూర్యభగవానుని ఉపస్థానంచేసి వచ్చినప్పటినుంచి ఆర్యపుత్రుడు శూన్యహృదయుడుగా కనబడుతున్నాడు. కనక ఆయనప్రియవయస్యుణ్ణి మాణవకయ్యని అడిగి ఆయనకి ఉత్కంఠాకారణ మేమో అడిగి తెలుసుకొనిరావే" అని. ఆబ్రహ్మబంధుణ్ణి నే నేలాగ కంగిస్తాను? కంగించ కేమి? సన్నని గరికపోచకొస నున్నమంచు

బొట్టులాగ ఇతనినాలికలో రహస్యము చాలసేపు ఉండదు. మఱి యితనినే వెతుకుతాను. [పరిక్రమించి చూచి] ఇదుగో మాణవకయ్య కదలక మెదలక చిత్తరువులోని తోలిలాగ నిలుచున్నాడు. ఇతనికాడికి వెళ్తాను. [సమీపించి] అయ్యా, దండము.

విదూ.—నీకు మేలు కలుగునుగాక. [ఆత్మగతము] ఈ చెడుచేటిని చూడగానే ఆ రాజరహస్యము హృదయాన్ని భేదించుకొని వెడలుతూ వున్నది. [ప్రకాశము] నిపుణికా, సంగీతవ్యాపారము మాని ఎక్కడికి వెడలినావు ?

నిపుణిక.—అయ్యా, దేవిపంపున నిన్నే చూడడానికి.

విదూ.—దేవి యేమి ఆజ్ఞాపిస్తున్నది ?

నిపు.—అయ్యడు ఎప్పుడున్ను నాయందు పక్షపాతి. నేను అనుచితవేదనచేత దుఃఖిస్తూ ఉంటే ఉపేక్షించడు.

విదూ.—[సవితర్కము] నావయస్యు డేమయినా ఆమెకి ప్రతికూలం చేశినాడా !

నిపు.—అయ్యా, ఎవతెనిమిత్తమె భర్త ఉత్కంఠితుడుగా ఉన్నాడో ఆమె పేర దేవిని పలకరించాడు.

విదూ.—[స్వగతము] స్వయముగానే ఆయనగారు రహస్యము వెలిబుచ్చినాడు. మఱి యిక నేనెందుకు నాలికని కట్టిపెట్టుకొని కష్టపడడము? [ప్రకాశము] ఏమి? దేవిని ఉర్వశీ అని పిలిచినాడా ? ఆమెని చూచినందువల్ల ఆయన వేదురుగొని వినోదములు మానుకొని నన్ను కూడా మిక్కిలీ పీడిస్తూ వున్నాడు.

నిపు.—[ఆత్మగతము] ప్రభువుయొక్కరహస్యదుర్గాన్ని నేను భేదించితిని. [ప్రకాశము] అయ్యా, దేవికి ఏమిఉత్తరం మనివి చేయను ?

విదూ.—నిపుణికా, ఆమెగారితో ఈలాగు విన్నవించు "నేనున్ను వయస్యుణ్ణి ఎండమావులనుంచి మళ్లించడానికి యత్నించి తర్వాత దేవిముఖం చూస్తాను," అని.

నిపు.—అయ్య చెప్పినట్టు చేస్తాను. [అని నిష్క్రమించును.

[నేపథ్యమున వైతాళికుఁడు.]

ఉ. నీకును హేళికిన్ సరిగ నెక్కొనెఁ గార్యభరాధికారముల్,
లోకతమఃప్రవృత్తి ప్రజలోఁ బరిలూనము మీకృశంబునన్;
ఏకని మేమ మాఁగును గ్రహేశ్వరుఁ డంబరమధ్యమంబునన్,
నీకును షష్ఠకాలమున నీమదిచొప్పున వర్తిలం దగున్. ౧౫

విదూ.—[చెవి యొగ్గి] వీడుగో వయస్యుడు, కార్యాసనంనుంచి లేచి ఇటువైపే వస్తున్నాడు. ఇతనికి పార్శ్వవర్తిని అవుతాను. [అని నిష్క్రమించును.

ప్రవేశకము ముగిసినది.

---



# ద్వితీయాంకము.

[అంతట ఉత్కంఠితుఁడు రాజు ప్రవేశించును, విదూషకుఁడును.]

రాజు.—

క. చూచియుఁ జూడక మున్నే
నా చిత్తము నిర్జరాంగనామణి సొచ్చెన్,
ఏచి వలరాచపాదుష
హా చేసిననారసంపు ద్వారమున ననన్. ౨౦

విదూ.—[ఆత్మగతము] పాపం కాశీరాజపుత్త్రి మిక్కిలి వెత జెందివున్నది.

రాజు.—రహస్యనిక్షేపమును కాచుచున్నావా?

విదూ.—[విషాదముతో ఆత్మగతము] అయ్యో! అయ్యో! అదానీ నన్ను మోసగించినది! కాకపోతే వయస్యుడు ఈలాగు అడగడు.

రాజు.—[సాశంకము] ఏమి? నీవు బదులు చెప్పకున్నావు?

విదూ.—ఈలాగు నీకు కూడా బదులు చెప్పనట్టుగా నేను నాలికని కట్టిపెట్టుకొని వున్నాను.

రాజు.—సరి. మరి యిప్పు డెచ్చట ఆత్మను వినోదపెట్టుకొందును?

విదూ.—వంటయింటికి వెళ్దాము.

రాజు.—ఏ మక్కడ?

విదూ.—అక్కడ పంచవిధభక్ష్యాలని దానిదాని సంభారాలతో కూరుస్తూ వుండడం చూస్తూవుంటే ఉత్కంఠ తీరుతుంది.

రాజు.—[చిఱునవ్వు నవ్వుచు] అక్కడ ఈప్సితసంవిధానముచేత నీవు ఆలరదువు. నాకోరిక తీరునట్టిది గాదు, నాకు ఎచట వినోదమేల కలుగును?

విదూ.—నీవు ఆమహానుభావురాలికి ఉర్వశికి కంటబడినావా?

రాజు.—అయిన నేమి?

విదూ.—అయిన, ఆమె దుర్లభ అని తలవనే తలవను.

రాజు.—పక్షపాతముచేత నిట్లు పలుకుచున్నావు.

విదూ.—నీవు ఇంత చెప్పినందున నాకు కుతూహలం కలిగినది. ఏమి! ఆ భాగ్యవంతురాలు ఉర్వశి నాలాగు సురూపంలో సాటిలేనిదిగా వుంటుందా?

రాజు.—మాణవకుఁడా, అరమణిని ప్రత్యవయవవర్ణన సేయుట అశక్య మని యెఱుంగుము. సంక్షిప్తముగా విను.

విదూ.—అవధానంతో వింటున్నాను.

రాజు.—

తే. భూషణమునకు మేలివిభూషణము, ప్ర
సాధనవిధికి మహితప్రసాధనంబు;
అమరసుందరివపువు సొంపారెడి నుప
మానమున కెల్లఁ బ్రత్యుపమాన మగుచు. ౨౧

విదూ.—అందువల్లనే నీవు దివ్యరసానికి ఆశించినవాడవై చాతకవ్రతం గ్రహించినావు.

రాజు.—ఉత్కంఠితునికి వివిక్తముకన్న వేఱొక శరణము లేదు. కావున నీవు ప్రమదవనమార్గముం జూపుము.

విదూ.—[ఆత్మగతము] ఏమి గతి? [ప్రకాశము] ఇటుఇటు. [పరిక్రమించి] ఈదక్షిణవాయువు ప్రమదవనముపంపున ఆగంతుకునికి నీకు ఎదురు వస్తున్నట్లు ఒప్పుతూ వున్నాడు.

రాజు.—[చూచి] ఈవాయువునకు ఆవిశేషణము తగినదే. ఏ లన,

ఆ. మాధవిని నిషేకమంజులఁ జేయుచు;
గొండ్లి నేరువుచును గుందలతకు,
స్నేహదక్షిణతల నెఱపుచు నీతఁడు
కామి వోలె నాకుఁ గానఁబడెడి. ౨౨

విదూ.—నీయభినివేశం కూడా ఇటువంటిదే అగు గాక. [పరిక్రామితకముచేత] ఇదే ప్రమదవనద్వారము. నీవు ప్రవేశించు.

రాజు.—నీవు ముందు ప్రవేశింపుము. [ఇరువురును చొత్తురు.

రాజు.—[ఎగురం గాంచి] వయస్యుఁడా, ప్రమదోద్యానప్రవేశము నాయాపదకు ప్రతీకార మని నేను తలంచితినే, అది పొరఁబాటు.

క. కోరితిని నేను జొరఁ బ్రమ
దారామముఁ; గాని, శాంతి యలరదు దానన్;
బోరన జక్కర కొని పో,
నేరి కయిన శక్య మగునె యెదు రీఁదంగన్. ౨౩

విదూ.—అదేలాగు?

రాజు.—

చ. దొరకనివస్తువుం దలచి దుండగ మైనమదీయచేతముం
మరుఁ డర లేక మున్ని పరిమార్చుచు నుండెఁ; మఱిప్పు డన్ననో,
తర మిడి పాండుపత్త్రముల దక్షిణమారుత మూడ్పఁ, దోఁట నం
కురములఁ జూపఁ జాగినవి క్రూరత మావు లిఁ కేమి చెప్ప నా! ౨౪

విదూ.—ఎందు కేడుస్తావు? త్వరలోనే అనంగుడే నీయిష్టాన్ని సమకూర్చి నీకు సుఖము గలిగిస్తాడు లే.

రాజు.—బ్రాహ్మణవచనమును ప్రతిగ్రహించితిని. [పరిక్రమింతురు.

విదూ.—చూడవోయి నీవు వసంతావతారసూచకాన్ని ప్రమదవనముయొక్క సొంపును.

రాజు.—అంతటను చూచుచున్నాను, ఎట్లన నిట—

ఉ. స్త్రీనఖపాటలాగ్రములు కృష్ణము లౌనిరుపాళ్లఁ గోరఁటల్,
కానఁగ నౌ భిదోన్ముఖము గాఁగ నశోక ముపోఢరాగ మై,
మా నగు నూత్నమంజరులు మావి రజోలవపింగళాగ్రముల్,
పూనె వసంతలక్ష్మి సఖ, ముగ్ధకుఁ బ్రోడకు మధ్యప్రాయముం. ౨౫

విదూ.—ఇదే బండిగురవెందతీగమంటపము, నీకై స్వయముగా ఉపచారములు సిద్ధపఱిచిన దనే లాగ తేంట్లసమ్మర్దంచేత రాలినపువ్వులతోడి మణిశిలాపట్టము గలదై, నిన్ను ఎదురుచూస్తూ వున్నది. కనక, దీనిని అనుగ్రహించు వయస్యుడా.

రాజు.—నీకు రుచించునట్లు చేసెదను.

విదూ.—ఇక్కడ నీవు సుఖంగా కూర్చుని, అందంపులతలు నీనేత్రాలను విందుగొల్పుతూ వుండఁగా, ఉర్వశిమీదినీయుత్కంఠను తీర్చుకో.

రాజు.—నిట్టూర్చి,

తే. జాతికుసుమలె మైనను శ్యామలందు
నమ్రవిటపలయుం దిది నాదుదృష్టి
రతి భజింపద యా దేవరమణిరూపుఁ
గన్నకారణమున దుండగము వహించి. ౨౬

కావున నాకోర్కి తీరుపట్టియుపాయము నరయుము.

విదూ.—[నవ్వి] ఓయి, అహల్యాకాముకునికి ఇంద్రునికి సచివుడు వజ్రమున్న ఉర్వశీలాలసునికి నీకు సచివుణ్ణి నేనున్న ఇద్దఱము వెఱ్ఱులము.

రాజు.—అతిస్నేహముచేత కార్యమార్గము తోచును.

విదూ.—ఇదె ఆలోచిస్తాను, నీయేడ్పులచేత నాసమాధిని భంగపఱచకు.

[చింతను రూపించును.

రాజు.—[నిమిత్తమును సూచించి, ఆత్మగతము]

తే. సకలశశిమండలాస్య యెూ సాధ్యగాదు!
ఇదియు మదనువిచేష్టిత మేమొ యేమొ!
ఐనఁ బ్రార్థిత మభిముఖం బైనభంగి,
నున్నయట్లుండి నిర్వృతి నొందె మనము. 12

[జాతాశుఁడై యుండును.

[అంతట ఆకాశయానమున ఊర్వశియు చిత్రలేఖయు ప్రవేశింతురు.]

చిత్ర.—సఖి, ఎక్కడికే కారణం లేకుండానే యీపోవడం ?

ఊర్వశి.—సఖి, అప్పుడు హేమకూటశిఖరాన శివకొమ్మచేత నాయాకాశగమనము క్షణము విఘ్నముపొందగా నన్ను పరిహసించినదానవు, ఇప్పుడు ఈలాగు అడుగుతా వేమి ?

చిత్ర.—ఏమి ? ఆ రాజర్షి పురూరవునికడకు తరలినావా ?

ఊర్వశి.—ఇది లజ్జను వంచించిన సాజతనము.

చిత్ర.—సఖి, ఎవరిని మరి ముందుగా పంపితివి ?

ఊర్వశి.—నాహృదయమునే.

చిత్ర.—అయినా చక్కగా ఆలోచించు.

ఊర్వశి.—మదనుడు నన్ను నియోగిస్తున్నాడు, ఇకను ఆలోచన కేమున్నది ?

చిత్ర.—ఇక నేను బదులు చెప్పలేను.

ఊర్వశి.—అట్లయితే మధ్యలో విఘ్నము కలగకుండా నాకు దారిచూపు.

చిత్ర.—సఖి, భయపడకు, భగవానుడు దేవగురువు అపరాజిత యనే శిఖాబంధనవిద్యను ఉపదేశించి మనలని దేవవైరులకు అలంఘనీయులనిగా చేశినాడు గాదా?

ఊర్వశి.—అహో ! నాహృదయము దాన్ని మఱచినది !

[* (సిద్ధమార్గములోనికి వచ్చి) ఇరువురు భ్రమణము రూపింతురు.

చిత్ర.—ఇదుగో యమునతోకూడడంచేత విశేషపావనమైన భాగీరథీభగవతి నీళ్లలో తన్ను తాను చూచుకొంటూ వున్న ప్రతిష్ఠానవగరానికి శిఖాభరణ మయిన రాజగృహమునకు వచ్చితిమి.

ఊర్వశి.—[చూచి] చెలీ, స్థానాంతరగత మయినస్వర్గము అని చెప్పవలెను, ఆయాపన్నశరణ్యుడు ఎక్కడ ఉండును ?

చిత్ర.—నందనవనఖండమువంటి యీ ప్రమదవనంలో దిగి తెలుసుకొందాము.

[ఇరువురు దిగుదురు.

చిత్ర.—[చూచి సంతోషముతో] సఖి, యుం నుదయించినచంద్రుడు వెన్నెలనుం బోలె ఇతడు ని న్నెదురు చూస్తున్నాడు.

ఉర్వశి.—[చూచి] సఖి, యిప్పుడు ప్రథమదర్శనమునకన్నా సాతిశయ ప్రియదర్శనుడుగా మహారాజు అవుపడుతున్నాడు.

చిత్ర.—యుక్తమే, కనుక రా, చెంతకు పోదాము.

ఉర్వశి.—తిరస్కరిణిచేత దాగి ఈయనచెంతనే ఉండి విందాముగాని, ఈ యేకాంతంలో పార్శ్వవర్తియైనవయస్యునితో ఈయన ఏమిమాటలాడుతున్నాడో.

చిత్ర.—నీయిచ్ఛప్రకారము. [అట్లు చేయుదురు.

విదూ.—ఓయోయ్యావు, ఆలోచించినానోయి నేను దొరకనిప్రియని పొందడానికి ఉపాయాన్ని. [రాజు ఊరకుండును.

ఉర్వశి.—ఎవతెగా నుండును ఆ చెలువ, ఈయన్ని వలపుపాలుచేసి తన్ను పొగిడించుకొంటున్నది ?

చిత్ర.—ఏమి మానుషవృత్తము నవలంబించితివి.

ఉర్వశి.—తటాలున ప్రభావంచేత తెలుసుకోడానికి భయపడుతున్నాను.

విదూ.—ఓయి, చెప్పుతున్నాను గదా ఉపాయ మాలోచించితి నని.

రాజు.—అటయిన చెప్పుము.

విదూ.—నీవు స్వప్నసమాగమకారిణి యైననిద్రను సేవించు. అటుగాకపోతే అమహానుభావురాలు ఉర్వశియొక్క పటము వ్రాసి చూస్తూ వుండు.

ఉర్వశి.—[సహర్షము] లఘుసత్త్వమా, హృదయమా, ఊరడి ల్లూరడిల్లు.

రాజు.—ఉభయమును సనిపడదు.

చ. అనయము కాముసంపఱకు నయ్యె సశల్యము చిత్త, మెట్లుగా
నెనయుచు నిద్ర స్వప్నమున నిందుముఖిన్ సమకూర్చునెచ్చెలీ,
కనుఁగొనఁ జిత్రమం దయినఁ గాంతను నోఁచన యైతి, నెన్నఁగన్,
ముసుపడి యశ్రు లుబ్బి కనుముంచెడి వ్రాఁత ముగింపనీయకే. ౨౨

చిత్ర.—సఖి, నీవు విన్నావా ?

ఉర్వశి.—వింటిని, కాని, హృదయానికి తనివి తీఱకున్నది.

విదూ.—ఈపాటియే నా బుద్ధివిశేషము.

రాజు.—[నిట్టూర్చుచు]

చ. తెలియుదువో దేవభావ మతితీవ్రము మద్ధృదయాభిషంగముల్?
తెలిసియు శక్తిచేత నవధీరణ సేయుదువో నాదుకూరిమిన్?
లలనగుఱించి తద్దయు నలబ్ధఫలోదయనీరసంబులన్
గలయికకోర్కులం బెసఁచి కాముఁడు తా సుఖ మొందుఁ గావుతన్.

చిత్ర.—విన్నావా?

ఉర్వశి.—అయ్యో! అయ్యో! నన్ను ఇటువంటిదాన్నిగా భావిస్తున్నాడు! ఇతనియెదుట బడి బదులు చెప్పడానికి అసమర్థురాలినిగా ఉన్నాను. ప్రభావముచేత భూర్జపత్త్రము నిర్మించి అందులో దీనికి బదులువ్రాతామని కోరుతున్నాను.

చిత్ర.—నాకు సమ్మతమే.

[ఉర్వశి సంభ్రమముతో యథోక్తము గావించి అకమ్మను వైచును.

విదూ.—[చూచి] ఓ యమ్మో! ఓయి బాబో! ఇదేమిటి యిది? పాము కుప్పసం లాగ మనయెదట పడినది?

రాజు.—[చూచి] భూర్జపత్త్రమందు అక్షరపంక్తులు.

విదూ.—కనబడకుండా ఉండి అనుమానుభావురాలు ఉర్వశి నీ మొఱ ఆలకించి సమానప్రేమను సూచించే అక్షరాలు వ్రాసి, వేసి ఉండరాదా?

రాజు.—కోరికలకు అందరానిది ఉండదు. [పుచ్చుకొని చదువుకొని హర్షములో] సఖుడా! నీయూహ ప్రసన్నముగానే ఉన్నది.

విదూ.—నీవున్ను ప్రసన్నుడవు అవు. ఇందులోనివ్రాత వినగోరుతున్నాను.

ఉర్వశి.—బలే, ఆర్యా, నాగరకుడవయ్యా!

రాజు.—విను [చదువును].

క. సామీ, సంభావించితి
వే నని నను నీవు తెలియ, కే నటు లేసిఁ,
ఆస్పృశితకల్పతల్పము
నీమొయి నందనసమీరమేలా యేఁచున్. 30

ఉర్వశి.—ఇప్పుడు ఏమి చెప్పునో?

చిత్ర.—తామరతూండ్లలాగ అవుతూవున్న అవయవాలచేత చెప్పనే చెప్పినాడు గదా.

విదూ.—బలే! ఆకలిగొన్న వానికి స్వస్తివాచకంలాగ నాకు ఓదార్పు దొరికింది.

మ. అనురాగంపు సముత్సుకత్వ ముద్దీపకఁ గా, స్వేదంపులాలిత్యముల్
దనుకన్, ప్రేయసి యీయుదాహరణముల్ దా నింపఁ బత్త్రంబునన్,

దనరెంబో మదిరాక్షిమోమె యిది యుత్ప్రేక్షింపునామోముతో
ననూనక్తం బయినట్టు లబ్రముగ నా కర్పించు చానందమున్. 31

ఊర్వశి.—ఇందు మా ప్రీతి సమవిభాగములుగా నున్నది.

రాజు.—ఏయస్యుఁడా, స్వేద్లచెమటచేత అక్షరములుచెడును. దీనిని ప్రేయసీ స్వహస్తమును పదిలముగా నుంపుము.

విదూ.—[కైకొని] ఏమి మరి అమహానీయురాలు ఊర్వశి నీకోరికలకు పువ్వు చూపి పండువిషయంలో కిమరిన్నూ వున్నది !

ఊర్వశి.—సఖీ, సరసకు పోవడానికి భయపడుతూవున్న నాహృదయాన్ని నేను కుదుటబడ జేసుకొనే లోపల నీవు ముందుగా ఆయనకు అగపడి నాకై తగిన మాటలు పలుకవే.

చిత్ర.—అట్లే. [అని తిరస్కరిణిని మాని రాజును దరిసె] జయము జయము మహారాజునకు.

రాజు.—[సహర్షము] స్వాగతము నీకు, కల్యాణీ,

క. చెలితోఁ గనఁబడుదానవు
చెలిఁ దేరక యంత ప్రీతి సేయవు నాకున్,
అలకూడలిలోఁ జూచిన
కళిందభవ గంగలేక కనఁబడినగతిన్. 32

చిత్ర.—తొలుత మబ్బుచారున్ను తర్వాత మెఱుపుతీగానున్ను గదా అగు పడును.

విదూ. [అపవారించి] ఏమి ! ఈమె ఊర్వశి కాదా ? అమహానుభావురాలికి సహచరియైనచిత్రలేఖయా ?

చిత్ర.—ఊర్వశి మహారాజును శిరస్సుతో ప్రణమిల్లి విన్నవిస్తున్నది.

రాజు.—ఏమి అజ్ఞాపించుచున్నది ?

చిత్ర.—“నాకు రక్కసునివల్ల కలిగినయిక్కట్టులో మహారాజే శరణ మాయెను. ఆనేను నీదర్శనమువల్ల ఏచినమన్మధునిచేత మిక్కిలి బాధపడుతూ మళ్లీ మహారాజే కనికరించవలసినదాన్నిగా ఉన్నాను.” అని.

రాజు.—భద్రముఖి,

తే. పలికెదవు ప్రియదర్శనబాళి నీవు,
అరయవు పుహూరవసునిఁ దదర్థ మార్తు;
మరుని కిది మాయిరువురయుమ్మడిప్రణయము
తప్తమగునిన్ను సఘటంబు తప్తమునకు. 33

నిపు.—[విభావించి] భట్టినీ, దొర్లడంలో పొదకట్టాటూ ఉన్న అక్షరాలతో కూడిది భూర్జపత్రము సుమా యిది. అహా! భట్టినియందె మొసకే తగుల్కొన్నది. [కైకొని] ఏమి? చదువుదునా ?

దేవి.—ఇలో నీవు చదువరో, విరుద్ధము కాదేని నాకు వినిపించు.

నిపు.—[అట్లే చేసి] భట్టినీ, అగుపట్ల ఆని తోస్తున్నది. భర్తను గూర్చి ఊర్వశి అల్లినకవనబంధంగా కనపడుతూవున్నది. మాణవకయ్యప్రమాదం మూలాన మన చేతులోపడ్డది.

దేవి.—అటయితే దానియర్థాన్ని తెలుసుకొంటాను.

[రాజు మున్ను చదివినదానిని నిపుణిక చదువును.

దేవి.—ఇక్కడ ఇదే చేకానుకగా అప్సరకాముకుని దర్శిస్తాను.

[అని పరిజనసమేతముగా తీవయింటి కరుగును.

విదూ.—ఓయి వయస్యా, ఏమిటి ఇది? ప్రమదవనముచెంగటి అటకొండ పర్యంతాన కనబడుతున్నది ?

రాజా.—[లేచి] భగవానుఁడా, వసంతప్రియుఁడా, దక్షిణమారుతుఁడా,

ఉ. తావికినై హరింపుము లతాసుసుమాళి వసంతసంభృతం,
బీవగ నాకుఁ గూర్మి హృదయేశ్వరిపంపు స్వహస్త మంటుచే !
ఈవహి రాగవినోదములనే మదనార్తునిప్రాణ ముండు నం
చీవ యెఱుంగు దంజన కహీనత మేల్పడి ప్రాణప్రాణమౌ. 32

నిపు.—భట్టినీ, దీన్నే వెతుకుతున్నారు.

దేవి.—చూస్తున్నాను.

విదూ.—ఓయి, మాసిపోతూవున్న కేసరాల కాంతతోడి సమీరముచేత మనము మోసపోతిమి.

రాజా.—ఎల్లవిఘ్నములను చెడితిని.

దేవి.—[సమీపించి] ఆర్యపుత్త్రుఁడా, ఆకులపడకు, ఇదుగో భూర్జపత్రము.

రాజా.—[సంభ్రమముతో] అహో దేవి! స్వాగతము దేవికి.

విదూ.—[అపవారించి] ఇప్పుడు దురాగతము ఆయినది.

రాజా.—వయస్యుఁడా, ఇపుడు ఇందులకు ఏమి ప్రతి సేయఁగలవాఁడను ?

విదూ.—దొంగసొత్తుతో దొరికినదొంగకు ప్రతివచనం ఉంటుందా ?

రాజా.—దేవీ, నేను దీనిని వెదకుచుండలేదు, వేరొక దానిని వెదకుట యిది.

దేవి.—తనసౌభాగ్యమును ప్రచ్ఛాదించడం తగినదే.

విదూ.—అమ్మా, ఈయనకు పైత్త్యోపశాంతి చేయఁగలభోజనం త్వరగా సిద్ధం చేయించు.

దేవి.—నిపుణికా, బ్రాహ్మణుడు శోభనముగా వయస్యుని ఆశ్వాసిస్తున్నాడు.

విదూ.—అమ్మా, చూడు మఱి, పిశాచం కూడా భోజనంచేత ఆశ్వసిల్లుతుంది.

రాజు.—మూర్ఖుఁడా, నన్ను బిట్టు అపరాధినిగా తెలుపుచున్నావు.

దేవి.—నీయం దపరాధము లేదు. నేనే ఇందులో అపరాద్ధను; ఏలన, నేను ప్రతికూలదర్శననై నీయెదుట నిలుచున్నాను. నేనిటనుండి వెళ్తాను.

[కోపము నటించి తరలును.

రాజు:—

తే. ఏ నగుదుఁగాక యపరాధినే క్షమింపు,
ముదుగు సంరంభగతిని రంభోరుకాండ,
నేవ్యజన మిట్లు కోపంబు చెంది యుండ
దాసునికి నెట్లు నిరపరాధత ఘటించు. ౩౭

[అని పాదములం ద్రెళ్లును.

దేవి.—[ఆత్మగతము] మెత్తమనసుదానిని నేను ఈ బతిమాలడంచేత ఉబ్బకుండునుగాక. కాని, నిర్దాక్షిణ్యాము వహించునందుకు కలిగే పశ్చాత్తాపానికి వెఱుస్తాను.

[రాజును విడిచి పరివారముతో నిష్క్రమించును.

విదూ.—వర్షానదివలె అప్రసన్నగానే వెళ్లినది దేవి. లేవోయి లే.

రాజు.—[లేచి] ఇది అనుపపన్నము గాదు. చూడు:—

తే. ఊనరసము లౌ ప్రియోక్తులు నూత్నమైనఁ
బ్రియునియనునయంబు ప్రియయెకెపుడుఁ
దాఁక నేర దెదను దద్విదులకుఁ గృత్రి
మంపుఁటెఱుపువన్నె కెంపుపోలె. ౩౮

విదూ.—నీ కిప్పు డిది అనుకూలమే. కన్ను కలగినవాడు ఎదట దీపశిఖను ఓర్వలేడు గదా.

రాజు.—అట్లు గాదు. నామనసు ఉర్వశిని తగులుకొన్నను, నాకు దేవియందు అదెప్పటిబహుమానమే. కాని, నా ప్రణిపాతమును అతిక్రమించినది గావున నేను దేవివిషయమున ధైర్య మవలంబించెదను.

విదూ.—నీధైర్యముమాట అటుండని, ఆకలిగొన్న బ్రాహ్మణునిప్రాణములను కాపాడడానికి నీవు యత్నించు. స్నానభోజనాలు కానియడానికి ఇది సమయంగదా.

రాజు.—[మీఁదికి చూచి] పగలు సగము కడచినది.

తే. ఉడికి వేఁడికి నెమలి కూర్చుండు సరగ
వలిఁ దొలఁగు తరుమూలాలవాలమునను,
కొండగోఁగున ముకుళంపుఁగొనను దొలిచి
లోన నిందిందిరమ్ము ఈ లీన మగును.

తే. క్రాఁగినజలంబు విడఁ దన్ని కన్నలేడి
గట్టునను మ్రొల్లబూవాకదట్టుఁ జేరె;
కేళిగృహమునఁ బంజరాంతర మదిగొ
వినుము క్లాంతమైన సారెకు వేఁడు జలము. ౪౦

(అందఱు నిష్క్రమింతురు.)

(ద్వితీయాంకము ముగిసినది.)

---

మిశ్రవిష్కంభకము.

(అంతట ఇరువురు భరతశిష్యులు ప్రవేశింతురు.)

ప్రథముఁడు — చెలికాఁడా, పల్లవుఁడా, మహేంద్రమందిరమునకు పోవుచు ఉపాధ్యాయులవారు నీచేతికి ఆసన మిచ్చిరి. నన్ను గృహసంరక్షణకై నిలిపిరి. కావున నడిగెదను – గురువుగారి ప్రయోగమును దేవసభ మెచ్చుకొన్నదా ?

ద్వితీయుఁడు. — గాలవా, మెచ్చుకొన్నదో లేదో చెప్పలేను. మఱి, సరస్వతి రచించిన లక్ష్మీస్వయంవరం అనే ఆ కావ్యబంధంలో ఆయా రసాంతరాలలో సభ తన్మయమై పోయింది. కాని,

ప్రథ. — ఏమో తప్పు సంభవించిన దని చెప్ప నున్నావు.

ద్వితీ. — అవును, అందులో ఉర్వశివాక్కులో పొరబాటు కలిగింది.

ప్రథ. — ఎట్లు?

ద్వితీ. — లక్ష్మీవేషంలో ఉన్న ఉర్వశిని వారుణివేషంలో ఉన్న మేనక అడిగింది:— 'సఖీ, త్రైలోక్యమహాపురుషులు సకేశవులు లోకపాలురు వీరే వచ్చి ఉన్నారు; ఇందులో ఎవరిమీద నీ మనస్సు తగులుకొంటున్నదో చెప్పు;' అని.

ప్రథ. — తర్వాత తర్వాత ?

ద్వితీ. — అంతట ఆమె నోటినుండి 'పురుషోత్తమునిమీద' అని రావలసి ఉండగా, 'పురూరవునిమీద' అని వాక్కు వచ్చినది.

ప్రథ. — ఇంద్రియములు కానున్నదానిని అనుసరించునవి. అందుకై ఆమెమీఁద గురువు కోపగింపలేదా ?

ద్వితీ.—ఆమెని ఒజ్జ శపించినారు. మఱి మహేంద్రుడు ఆమెని కనికరించినాడు.

ప్రథ.—ఎట్లు?

ద్వితీ.—'నీవు నాయుపదేశమును అతిక్రమించినకారణంచేత నీకు దివ్యస్థానం ఉండదు;' అని ఒజ్జశాపము. మఱి, ఆట ముగిసినతర్వాత లజ్జచేత తలవంచుకొని వున్న ఉర్వశికి మహేంద్రుడు ఈలాగు చెప్పినాడు:- 'ఎవనిమీద నీమనసు తగులుకొన్నదో, అతడు నాకు రణసహాయుడు రాజర్షి; అతనికి ప్రియంచేయవలెను. కనక నీవు ఆయనను పురూరవుని ఆతడు నీవల్ల సంతానవంతుడు అయ్యేదాకా యథేచ్ఛంగా కూడు.'

ప్రథ.—పురుషాంతరవేదికి మహేంద్రునికి తగి యున్నది.

ద్వితీ.—[సూర్యుని చూచి] మాటలఆసక్తిలో మనము ఒజ్జగారిస్నానవేళను తప్పినాముగదా. రా మరి, ఆయనప్రక్కనే ఉందాము.

[అని నిష్క్రమింతురు.

మిశ్రవిష్కంభకము ముగిసినది.

---

# తృతీయాంకము.

[అంతట కంచుకి ప్రవేశించును.]

కంచుకి.—

ఉ. వేసవప్రాయమునం దనుభవింపుదు రెల్లకుటుంబు లర్థముల్,
తోకములం దనంతరము ద్రోచి భరంబు భజింతు రూఱటన్;
మా కయినన్ శరీరమును మాల్పుచు నిచ్చలు వార్ధకంబునన్
బైకొను సేవ యందుఁ జెఱ! పైదలులం దధికార మక్కటా! ౮౧

[పరిక్రమించి] నియమస్థురాలు కాశిరాజపుత్రి నన్ను ఆదేశించినది ఏమనఁగా— "నేను వ్రతము నెఱవేర్చుకొనుదాననై అలుక ఉజ్జగించి నిపుణికముఖముగా మహారాజును పూర్వము వేడియున్నాను. దానినే నీవు నామాటవలన విన్నవింపుము." అని. నేనును ఇప్పుడు సంధ్యాజాప్యమును ముగించుకొన్నమహారాజును చూచెదను. [పరిక్రమించి, చూచి,] రాజభవనమందు దివసావసానవృత్తాంతము రమణీయము గదా. ఎట్లన, నిచట,-

మ. నిలుచున్ మల్చినయట్లు మన్కిగడలన్ నిద్రాలసంబుల్ శిఖుల్,
వలభుల్ భాసిలు జాలధూపములచేఁ బారావతాళిక్రియన్,

బలిపుష్పాంచిత హైమవతాన్నములను బ్రజ్వాలంబులన్ సాంధ్యమున్
గళదీపంబులఁ బంతు రాచగణనిక్తల్ వృద్ధ లంతఃపురిన్. ౪౨

[నేపథ్యమువైపు చూచి] ఆహా! మహారాజు ఇట్లే వచ్చుచున్నాఁడు.—

తే. చుట్టురాఁ గరదివ్వెలఁ బట్టి కేల
నూడిగపుఁబాండ్రు గొలిచి రా, నొప్పు నితఁడు,
కొండగోఁగులు తటములనిండఁ బూచఁ,
జట్టుపలుపోఁడిఁ జరియించు శైల మనఁగ. ౪౩

ఈయనను దృష్టిపథములో నిలిచి ఎదురుచూచెదను.

[అంతట యథానిర్దిష్టుఁడగు రాజు ప్రవేశించును, విదూషకుఁడును.]

రాజు.—[ఆత్మగతము]

తే. పనులలోఁ జొచ్చి యుత్కంఠ వెనుక కుంచి
పవలు గడపితి నంతగా బాధపడక,
అకలితవినోద మైన దీర్ఘయామ మగుచు
నొంచు రాతిరి నెట్లు వేగింతువాఁడ. ౪౪

కంచుకి.—[సమీపించి] జయము జయము దేవరకు. దేవేరి విన్నవించుచున్నది:—"మణిహర్మ్యముమీఁద చంద్రుఁడు ఎంతయు మనోహరముగా వగపడును అచట సన్నిధి యొసంగు దేవరతోఁగూడ రోహిణీసంయోగము దాఁక ఎదురుచూచుచుండఁ గోరుచున్నాను." అని.

రాజు.—ఆర్యుఁడా, లాతవ్యుఁడా, దేవితో 'సయిచ్చ' అని విన్నవింపుము.

కంచు.—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

రాజు.—వయస్యా, దేవేరియారంభ మిది, ఏమి పారమార్థికముగా వ్రతనిమిత్తమే అగునా?

విదూ.—ఓయి నాకు తోచునది – దేవిగారు పశ్చాత్తాపంపొందినదై నీ ప్రణిపాతపు ఉల్లంఘనాన్ని వ్రతమిషచేత విడిచివేయ్యడానికి కోరుతున్నది – అని.

రాజు.—ఉపపన్నమునే నీవు చెప్పితివి. అట్లే గదా—

క. ప్రణతిన్ లంఘించి తొలిన్
వెనుకం దాపంబు నొంది వినిగూఢముగా
ననునయము లొసఁగి ప్రియునికి
మనస్వినులు మాన్పికొందురు మదిలోని త్రపన్. ౪౫

కనుక మణిహర్మ్యముమీఁదికే మార్గము చూపుము.

తే. విషమశిలలచాలు వేగంబు నుడిపిన
యేటిజాలు వోలె నింతితోడి
పొందు విఘ్ననిహతిఁ బొందినకతమున
శతగుణత్వ మొందు స్వాంతశయుఁడు. ౨౭

విదూ.—అంగములు క్రుస్సిపోవుచున్నను అధికంగా శోభిస్తున్నావు. అందువల్ల నీకు ప్రియాసమాగమము వెంటనే ఉన్న దని తలుస్తాను.

రాజు.—[నిమిత్తమును సూచించి] వయస్యా,

తే. గురుశోకాతురు నన్నుఁ
నెరకోర్కులు గొల్పునుడుల నీ వెటులో యటుల్
కర మాశ్వాసించు బలే!
స్ఫురణములఁ దక్షిణంబు భుజ మిది మిత్రా. ౨౮

విదూ.—బ్రాహ్మణునివచనం తప్పదు గదా.

[రాజు సప్రత్యాశముగా నుండును.

[అంతట ఆకాశయానమున అభిసారికావేష ఉర్వశియు,
చిత్రలేఖయు ప్రవేశింతురు.]

ఉర్వశి.—[తన్ను తాను చూచుకొని] సఖి చిత్రలేఖా, అల్పాభరణభూషితము నల్లనివీణాముతోడియీయభిసారికావేషము నీకు అందగిస్తూ ఉన్నదా?

చిత్ర.—వర్ణించడానికి నాకు వాగ్విభవము లేదు. ఇట్లు తలుస్తున్నాను, నేను పురూరవుణ్ణి అవుదును గాక, అని.

ఉర్వశి.—సఖి, మదనుని అన, నీకు, నన్ను శీఘ్రంగా ఆసొబగునియింటికి కొనిపొమ్మని.

చిత్ర.—ఇదుగో, మలిచినకైలాసశిఖరంలాగ ఒప్పుతున్న ప్రియమిత్రుని భవనాన్ని దటిసితివి.

ఉర్వశి.—అట్లైతే, ప్రభావంచేత తెలుసుకోవే ఆయన నాహృదయచోరుడు ఎక్కడ ఉన్నాడో ఏమి చేస్తున్నాడో.

చిత్ర.—[ధ్యానించి, ఆత్మగతము] కానీ, ఈమెను కొంచెము ఆడిస్తాను. [ప్రకాశము] సఖి, ఈయన మనోరథప్రాప్తమయిన ప్రియాసమాగమసుఖాన్ని అనుభవిస్తూ ఉపభోగక్షమమైన ప్రదేశంలో ఉన్నాడు.

[ఉర్వశి విషాదము నటించును.

చిత్ర.—ఓసి గోలా, ప్రియసమాగమానికి వేఱే చింత యేమున్నది?

ఊర్వశి.—[ఊటాడిల్లి] అపక్షీణము నాయెద సందేహపడినది.

చిత్ర.—[చూచి] వీడుగో మణిహర్మ్యముమీద వయస్యమాత్రసహాయుఁడు రాజర్షి. రా మఱీ అతనిని సమీపింతాము.

[ఇరువురు దిగుదురు.

రాజు.—వయస్యుఁడా, రాత్రితోఁగూడ మదనబాధ పెర్చుచున్నది.

ఊర్వశి.—అర్థము బయలుపడనియీవచనంచేత నాగుండె తల్లడిల్లుతున్నది. అగపడకుండియే విందాముగాక మనసంశయము తీరిందాకా, వీరినమ్మకపునుడువులు.

చిత్ర.—నీ కిచ్ఛయయినట్లు.

విదూ.—ఓయి అమృతము లీనుతున్నయీచంద్రపాదాలని సేవించు.

రాజు.—వయస్యుఁడా, ఈవ్యాధి, యిట్టి సాధనములకు కుదురునది గాదు. చూడు:—

చ. సుమశయనంబు నూతనము, సోమునినిండుమరీచిపిండు, దే
హమున నలందుచందనము, నచ్చపుముత్తెపుఁజే, ర్లివన్నియుఁ
దమములు గావు నామనసిజాతరుజన్ గుదియింప; శక్తి యా
యమరియునుఁ—

ఊర్వశి.—మఱి యన్య ఎవతె?

రాజు.—

వివిక్తమున వ్యాహ్రియమాణము తత్కథాళియుఁ. ౧౦

ఊర్వశి.—హృదయమా, నన్ను వదలి ఇతనిం గూడినందుకు ఫలమును నీవు ఇప్పుడు అనుభవించితివి.

విదూ.—అవును. నేనున్ను మిష్టమయినలేడిమాంసం తిన దొరకనప్పుడు దానిని వేడుతూ కీర్తిస్తూ ఊటాడిల్లుతాను.

రాజు.—ఇది నీకు ఘటించును.

విదూ.—నీకున్ను అది త్వరలోనే ఘటించును.

రాజు.—సఖుఁడా, ఇట్లు తలంచెదను.

చిత్ర.—ఓసి! అసంతుష్టురాలా, విను.

విదూ.—ఎట్లు?

రాజు.—

క. ఆయింతి తేరికుదుపున
క్రై యేయీయంస మొత్తె నాత్మాంసముచే,
నాయంగ మిది యొకఁడె నా
కాయమునఁ గృతార్థమా, మిగత భర మిలకుఁ. ౧౧

చిత్ర.—ఇప్పుడు తాపసింప నేల?

ఊర్వశి.—[కోటాలునఁ దలచి] సఖీ, నేను దరిసి ఎదుర నిలిచినా మహారాజు ఉదాసీనుడుగా నున్నాడే?

చిత్ర.—(స్మితముతో) మరి తొందరముచేత తిరస్కరిణిని తొలగింప వైతివి.

[నేపథ్యమున]

భట్టిని, ఇటు ఇటు.

[అందఱు చెవి యొగ్గుదురు. ఊర్వశి సఖితోఁ గూడ విషాదము చెందును.

విదూ.—ఓహో! వచ్చినది దేవి! కనక వాచంయముఁడవుగా వుండు.

రాజా.—నీవును గుట్టు దాఁచి యుండుము.

ఊర్వశి.—సఖి, ఇప్పుడేమి చేతాము?

చిత్ర.—దిగులు పడకు. మనము మఱుగి యున్నాము. రాజర్షి పట్టపుదేవి ఉపవాసవ్రతకృశగా కనబడుతున్నది. కనక, ఈమె యిక్కడ చాలా సేపు ఉండదు.

[అంతట ఔపహారికహస్తపరిజన దేవి ప్రవేశించును.]

దేవి.—[పరిక్రమించియు చూచియు] ఒసే, నిపుణికా, వీడుగో భగవానుడు చంద్రుడు, రోహిణింగూడి అధికంగా శోభిస్తున్నాడు

చేటి.—భట్టిదేవితో గూడితే భర్త విశేషరమణీయుడు గాడా?

[పరిక్రమించును.

విదూ.—[చూచి] ఓయి నాకు స్వస్తివాచనం ఇస్తుందో, కాక, నీకు వ్రతమిషచేత రోషము పోని ప్రణిపాతలంఘనాన్ని విడిచివేసుకో గోరి యున్నదో, ఎఱుగను. గాని, ఇపుడు నాకండ్లకు శుభదర్శనగా ఉన్నది దేవి.

రాజా.—[స్మితముతో] ఉభయమును ఘటిల్లును. అయినను నీవు పిమ్మట చెప్పినదే అది నన్నుగురించినదిగా తోఁచుచున్నది. ఏలన ఈమహానీయురాలు—

ఉ. ధౌతదుకూలయుగ్మమును దాలిచి మంగళమాత్రభూషయై
పూతము లైనలేగఱికమోసులఁ జూర్ణకచాళిఁ జెర్వియుఁ
జేతములోనిగర్వ మపదిశ్యపదేశమునన్ ద్యజించియుఁ
గాతరనేత్ర నాపయిని గన్నప్రసాదముఁ దెల్పు మేననే. ౧౨

దేవి.—[దరిసి] జయము జయము ఆర్యపుత్రునికి.

విదూ.—దేవిగారికి స్వస్తి.

రాజా.—దేవికి స్వాగతము.

[ఆమెను చేతఁ బట్టి కూర్చుండఁబెట్టును.

ఊర్వశి.—సఖి, ఈమె దేవీశబ్దముచేత ఉపచార మొందుట యుక్తమే. తేజములో శచికి ఏమాత్రము తక్కువపడదు.

చిత్ర.—బళి, యనూయావిముఖంగా పల్కితివి.

దేవి.—ఆర్యపుత్రుని పురస్కరించుకొని నే నొకానొకనోము నోచవలసి ఉన్నది. అందుకై ముహూర్తముసేపు ఆకటు సహింపవలెను.

రాజు.—అట్లనవలదు. ఇది అకటయెట్లు? అనుగ్రహము గదా.

విదూ.—స్వస్తివాచనము కల దైనయిటువంటి నిర్బంధము తరుచుగా కలుగును గాక.

రాజు.—దేవి చేసెడియీనోము పేరేమి?

[దేవి నిపుణికం గాంచును.

నిపు.—దేవరా, దీనిపేరు ప్రియానుప్రసాదనము.

రాజు.—[దేవిని చూచి] అట్లేని

తే. గాత్రమును బిసమృదువు నకారణముగ
నీవ్రతముచేతఁ గల్యాణి యేల వాఁడ్చ?
చాఁచు నెవఁడంజలిని నీప్రసాదమునకు
ననునయింతువె యాదాసజనుని నీవు? 13

ఊర్వశి.—ఈమెయందు ఇతనికి బహుమానము మిక్కుటంగా నున్నది.

చిత్ర.—ఓసి బేలా, ప్రేమడి ఒరులపాలయినపుడు నాగరకులు అధికంగా దాక్షిణ్యము చూపుతారు.

దేవి.—[సస్మితముగా] వట్టి యీనోము నోచడంవల్ల ఈ ప్రభావము; ఏమన, ఆర్యపుత్రుడు ఈపాటియేని పల్కరించినాఁడే.

విదూ.—ఊరుకోవయ్యా! మంచిమాటను నిరాకరించగూడదు.

దేవి.—కిల్లలారా, పూజాద్రవ్యాలని తెండి, మణిహర్మ్యమందున్న చంద్రపాదములను పూజిస్తాను.

పరి.—ఇదుగో, గంధము పువ్వులు లోనైనయుపహారము.

దేవి.—[నాట్యమున గంధపుష్పాదులతో చంద్రపాదములను అర్చించి] ఓసీ, ఈ యుపహారమోదకాలని మాణవకయ్యకు సమర్పించండి.

పరి.—దేవియాజ్ఞ. మాణవకయ్యా, ఇదుగో ఇది నీకు.

విదూ.—[మోదకాలపళ్లెరముం గైకొని] అమ్మా, నీకు స్వస్తి. నీయుపవాసము బహుఫలము అగుగాక.

దేవి.—ఆర్యపుత్రుడా, ఇటు.

రాజు.—ఇదె ఉన్నాను.

దేవి.—[నాట్యముచే రాజును పూజించి, చేమోడ్పులో మ్రొక్కి] ఇదుగో నేను ఈదేవతాదంపతులను రోహిణీ నిశాంకులను సాక్షీకరించి ఆర్యపుత్రుని అనుప్రసన్నుని చేస్తున్నాను. ఇది మొదలుకొని ఏచెలువను ఆర్యపుత్రుడు వేడునో, ఎవతె ఆర్యపుత్రునిసమాగమానికి ఉవ్విళ్లూరుతుంగో, ఆచెలువతో నేను ప్రేమబంధముతో వర్తింపవలయును అని.

ఊర్వశి.—అహో! ఈమాటకు అభిప్రాయ మేమో ఎఱుగకున్నాను. నాకు మఱి హృదయము విశ్వాసముచేత విశదమైనది.

చిత్ర.—సఖి, మహానుభావురాలు పతివ్రత నీకు అనుజ్ఞ యిచ్చింది, ఇక నిర్విఘ్నంగా నీకు ప్రియసమాగమం కలుగుతుంది.

విదూ.—[అపవారించి] చెయి తెగినచెంబడివాడు చేప తప్పించుకొని పోగా 'ఇంగువల్ల నాకు ధర్మం కలుగుతుంది' అని చెప్తాడు. [ప్రకాశము] అమ్మా, ఏమి నీకు అట్టి ప్రియుడా ఈదొడ్డవాడు?

దేవి.—మూర్ఖా, నేను నాసుఖమును మానుకొని ఆర్యపుత్రుని సుఖితశరీరుని చేయడానికి కోరుతున్నాను. అందువల్ల తెలుసుకో ప్రియుడో కాడో అని.

రాజు.—

క. ఈఁగల వాంఛోకతెకుఁ, గ్రో
కోఁగల వీడాను నీవు కొమ్మ; యక్లైనన్,
నేఁ గా నట్టిఁడ నెట్టినిఁ
గాఁ గొంటివొ నను నకాండకాతరమతి వై. ౫౪

దేవి.—అవుదువో కావో, ఉద్దేశించిన ప్రకారము ప్రియానుప్రసాదనవ్రతము నెఱవేఱినది. పిల్లలారా, రండి వెళ్దాం.

[దేవి తరలినది.

రాజు.—ప్రేయసీ, ఇపుడు నన్ను వదలిపోయితేని నేను ప్రసాదితుఁడను గాను.

దేవి.—ఆర్యపుత్రుడా, నే నెప్పుడు నియమమును ఉల్లంఘించినదాన్ని కాను.

[దేవి సపరివార నిష్క్రమించును.

ఊర్వశి.—సఖీ, రాజర్షి ప్రియకళత్రుడు, మఱి నేను హృదయాన్ని అపుకోలేక ఉన్నాను.

చిత్ర.—అయితే, నీవు నిరాశవై నివర్తిస్తావా?

రాజు.—[ఆసనముం బొంది] వయస్యా, దేవి దూరము పోయి యుండదు.

విదూ.—చెప్ప దలచుకొన్న మాటను జంకు లేకుండా చెప్పు. రోగము అసాధ్య మని వైద్యుడు రోగిని విడిచివేసినట్లు, నిన్ను ఆయిల్లాలు స్వచ్ఛందవర్తినిగా వదిలివేసింది.

రాజా.—మరి ఊర్వశి యే మయినా,—

ఊర్వశి.—కృతార్థురాలు అగునా!

రాజా.—(శ్లోకము)

తే. లీనమై యుండెరవళిమాత్రాన నాదు
వీనుదోయికి విందుగావించునొక్కొ?
వెనుక కల్లన వచ్చి నావీక్షణములఁ
ముగ్ధకరపంకజములతో మూయు నొక్కొ?

తే. హర్మ్యశాలమున నిచటఁ దా నవతరిల్లి
మలసి మందాక్షమందాయమాన యగుచు
నను గడుగు గాఁగఁ బెట్టించి గడుసుఁజెలియ
బలిమిఁ దేర నాకడకుఁ దా వచ్చునొక్కొ? ౫౫

ఊర్వశి.—సఖీ, ముందుగా, ఇతనికోరికను తీరుస్తాను.

[వెనుకకుఁ బోయి కనికన్నులను మూయును.
చిత్రలేఖ విదూషకునికి సన్న సేయును.

రాజా.—[స్పర్శ రూపించి] చెలికాఁడా, ఈవరారోహ నారాయణునితొడనుండి జనించినట్టిది.

విదూ.—నీవు ఎట్లు తెలిసికొంటివి?

రాజా.—ఇందు తెలియని దే మున్నది?

క. స్మరశరజర్జరితం బీ
శరీర మిఁక నెవతె చేతిస్పర్శకుఁ దనియున్?
హరిణాంకాంశువులకుబలెఁ
దరణికిరణములకుఁ గలున దాల్పదు తనువున్. ౫౬

ఊర్వశి.—[చేతుల నెడలించి లేచి కొంచెము అవలికి జరిగి] జయము జయము మహారాజుగారికి.

రాజా.—సుందరీ, స్వాగతము. [తనతో ఏకాసనముందే కూర్చుండఁ బెట్టును.

చిత్ర.—వయస్యునికి సుఖమా?

రాజా.—నిశ్చయముగా సమకూడినది.

ఊర్వశి.—ఇంతకన్న ప్రియతరము పల్కడానికి నాకు విభవంలేదు.

రాజా.—[ఊర్వశిని కేలఁ బట్టి] అహో! ఈప్సితలాభ మనఁగా విరుద్ధములు పెరుఁగుట గదా.

శా. ఆపాదంబులె మైందవంబులు పరాహ్లాదం బిడున్ మేనికిన్,
ఆపౌష్పేషవబాణసంతతులె పెల్లానంద మొందించెడిన్,
ఏపుం జూపుచు నేది యేది మును నన్నేఁచెన్ సఖీ, యిప్డదే
ప్రాపయ్యెన్ నినుఁ గూడ నాకనునచుప్రాప్తంబులోలెన్ వెసన్. ౫౯

ఊర్వశి.—విలంబముచేత ఆర్యపుత్రునియెడ అపరాధిని నైతిని.

రాజా.—కాదు అట్లు గాదు.

తే. ఎట్టకేలకుఁ గృచ్ఛ్రిన నెనసినట్టి
సుఖమె రసవత్తరం బయి శోభఁ జెందు,
వడకు సోలినతఱిని నిర్వాణ మొసఁగుఁ
జెట్టునీడ నరునకు విశేషముగను. ౬౦

విదూ.—ప్రదోషరమణీయమైనచంద్రపాదాలని సేవించినావు. ఇప్పుడు నీకు పడకటిల్లు చేరడానికి సమయము.

రాజా.—అటయిన, నీసఖికి మార్గము చూపుము.

విదూ.—అమ్మా, ఇటు ఇటు. [అని పరిక్రమింతురు.

రాజా.—ఇది ఇప్పుడు నాప్రార్థన.

ఊర్వశి.—ఏమని?

రాజా.—

ఆ. శతగుణితయుఁ బోలె జరిగె మున్ను త్రియామ
యనుపగతమనోరథునకు నాకు,
అట్లె జరుగునేని యంభోజపత్త్రాక్షి
నీసమాగమమున నేను కృతిని. ౬౧

[అని అందఱు నిష్క్రమింతురు.

తృతీయాంకము సమాప్తము.

## ప్రవేశకము.

క. అనుఁగుసఖిఁ బాసి వసలఁ
బనవ సఖియుక్త హంసి వ్యాకులమతి యై,
ఇనకరసంస్పర్శకు వి
చ్చినసెత్తామరలకొలనిసీములయందుఁ. 1

[అని చిత్రలేఖాసహజన్యల ప్రావేశికి అక్షిప్తిక.]

[అంతట విమనస్క చిత్రలేఖయు సహజన్యయు ప్రవేశింతురు.]

చిత్రలేఖ ప్రవేశాంతరమున ద్విపదికతో దిక్కులుఁ జూచి]

[గేయము]

సఖి కనఁబడనియంత,
సరసునఁ గ్రందిలు వంత,
అశ్రులు వెల్లువ గాఁగ,
హంసీయుగము మది గ్రాఁగ. 2

సహజన్య.—సఖి, చిత్రలేఖా, వాడిపోతూవున్న నూఱు ఱేకులతామర పూవులాగు ఉన్న నీముఖంయొక్కఛాయ నీహృదయంలోపలి అస్వస్థతని తెల్పుతున్నది. నీదుఃఖానికి కారణ మేమో చెప్పవే. నీతో సమదుఃఖను కాగోరుతున్నాను.

చిత్ర.—సఖి, సహజన్యా! అచ్చరలవంటువరుసను ఇక్కడ సూర్యభగవంతునికి పాదములసేవ నేను చేయవలసివున్నాను. అందుచేత ఉర్వశికోసము అధికంగా ఉత్కంఠితురాలి నై యున్నాను.

సహ.—ఎఱుగుదును మీయన్యోన్యప్రేమను. తర్వాత తర్వాత?

చిత్ర.—అంతట ఈదినములలో దానివృత్తాంత మేమో అని సంయమమున చూడగా అత్యాహితము కనబడినది.

సహ.—[ఆవేగముతో] ఏలాగు?

చిత్ర.—ఉర్వశి రాజ్యభారమును మంత్రులమీద ఉంచిన రతిసహాయుణ్ణి ఆరాజర్షిని తోడుకొని విహారార్థ మై గంధమాదనవనానికి వెళ్లినది.

సహ.—అటువంటిస్థలములలో కలిగేది ఏదో అదే గదా సంభోగ మనగా. తర్వాత, తర్వాత?

చిత్ర.—అక్కడ మన్దాకినీపులినములలో క్రీడిస్తూవున్న ఉదయవతి అనే విద్యాధరకన్యకను ఆరాజర్షి తేరి చూచినాడని ఉర్వశి అలిగినది.

సహా.—సరే. మిక్కుటమైనప్రేమకు సహన ముండదుగదా. తర్వాత తర్వాత!

చిత్ర.—అంతట, కాంతుడు ఎంత బతిమాలుకొన్నా మెత్తబడక ఉపాధ్యాయశాపహతహృదయయై స్త్రీలు చొరరానిదైన కుమారవనం చొచ్చినది. చొచ్చినవెంటనే కారణాంతరముచేత ఈమెరూపము తీగగా మారిపోయినది.

సహా.—విధికి అసాధ్యము లేదు, అటువంటిఅనురాగానికి అకస్మికంగా ఇటువంటియీయనర్థపరిణామము! ఇప్పుడు ఆరాజర్షి యవస్థ యేమి?

చిత్ర.—ఆయన ఆకాననలోనే ప్రియతమను వెతుక్కుంటూ రేయింబగళ్లు గడుపుతూ వున్నాడు; వీతరాగులకు కూడా ఉత్కంఠను గలిగించే యీ మేఘోదయంచేత అనర్థముపాలయి పొయ్యేని.

[అనంతరమున జంభలిక]

[గేయము]

సఖి కనఁబడనియంత,
సరసునఁ గ్రందిలు వంత,
అశ్రులు వెల్లువ గాఁగ,
హంసీయుగము మది గ్రాఁగ. 3

సహా.—సఖి, అటువంటి ఆకృతివిశేషములు చిరకాలము దుఃఖభాజనములు కానేరవు. తప్పకుండ ఏదో అనుగ్రహరూపమైననిమిత్తము వారికి సమాగమకారణమవుతుంది. రా మరి, పొడుపనున్న ప్రొద్దువేల్పును సేవింతాము.

[అనంతరమున ఖండధార]

[గేయము]

చింతావిధూనమానసయై
స్నిగ్ధాదర్శనలాలసయై
వికచపద్మాంచితనీరమున
విహరించు హంసి కాసారమున. 4

[అని నిష్క్రమింతురు

(ప్రవేశకము ముగిసినది.)

# చతుర్థాంకము.

[గేయము]

క. కరిపతి సొచ్చె వనిం బ్రియా
విరహోన్మాదంబునలసి విస్మృతిఁ దలుపున్
తరుపతితకిసలయను మో
త్కరమండిత మగుచు భూరికాయు న్నెమ్మెన్. 5

[అని పురూరవుని ప్రావేశికి ఆక్షిప్తిక ]

[అంతట ఉన్మత్తవేషుఁడు రాజు ప్రవేశించును.]

రాజు.—ఆ! ఓరిపాపిష్ఠ రక్కసుఁడా, నిలునిలు. నాప్రేయసిం గొని యెట కేఁగెదవు? ఆ కొండకొమ్మునుండి మింటికెగసి నామీఁద బాణాలు కురిపించుచున్నాఁడు [బెడ్డకైకొని కొట్టుటకు పరువిడుచు, అనంతరము ద్విపదికచే దిక్కులు సూచి]

[గేయము]

స్వాంతము సకి వగ మేర్పన్
సరసిం దాఁ బట్టుపడ లార్పన్
అశ్రుపూరితనయనుం డై
హంసతరుణుఁడు దీనుం డై. 6

[పరికించి]

మ. ఇది సన్నద్ధము నైన వారిదము, గాఁ డింద్రారి గర్వాంధుఁ డి;
య్యది యింద్రాయుధ మౌను గాని, శ్రవణాంతాకృష్టమౌర్విన్ గా;
దిది యాసారము గాని, బాణతతి గా; దీర్ఘైకశాఖ నా
హృదయాధీశ్వరియైన యుర్వశియుఁగాదే, శంప రా నక్కటా!—

[అని మూర్ఛిల్లి పడి, ద్విపదికచే లేచి నిట్టూర్చి.]

క. మదిరేక్షణను హరించెన్
మదమున రక్కసుఁ, డనుచు భ్రమించితిని నే,
నది సూడఁ గ్రొమ్మెఱుఁగుఁ దీ
వ దళత్తళలాడ మబ్బు వర్షించెడినే. 7

[ఆలోచించి] రంభోరువు ఎటకేఁగియుండును ?

మ. కినుకన్ శక్రత దిచ్చుకొ మయినదో? కిన్కం జిరం బూనదే;
చనెనో నాకముఁగూర్చి? నాయెడఁ గడున్ స్వాంతంబు భావార్ద్రమౌ;
కొని పో నాయెదురన్ దెగింపుదురె రక్షోవీరు లైనన్ సఖిన్?
కనుక న్బైఁ ప్రియు యత్తమిల్లె! నిటులన్ గారింతువే దైవమా! ౬౬

[అని ద్విపదికచే] [దిక్కులం గాంచి, నిశ్వాసములతో] [అశ్రువులతో] దైవము విపరీతమయినవారికి దుఃఖమువెంట దుఃఖము సంభవించును. ఎట్లన:—

ఆ. వచ్చె నిపుడె నాకుఁ బ్రాణనాయికతోడ
నోపరానివిరహతాపభరము,
అభినవాంబుధరము లాతపర్ధిన్ నడంప
హితము లగుదినములు నివె తొడంగె. ౬౭

[అనంతరమున చర్చరి]

క. జలద, కినియకు, ముదల; యువి
రళిధారాధౌతభాసురదిశాముఖుఁడా;
ఇలఁ గందునేని సకి, న
వ్వల నీ వేమి పఱపిన నవారణ నైతున్. 8

[విహసించి] వ్యర్థముగా నేను నామనస్సులో నిపరితాపవృద్ధిని ఉపేక్షించుచున్నాను. మునులుకూడ చెప్పుదురు గదా, 'రాజు కాలమునకు కారణము' అని. కనుక నే నేల మేఘర్తువును మాన్పివేయఁగూడదు.

[అనంతరమున చర్చరి]

[గేయము]

గంధమ సమధుకరకలగానము
వాద్యమానపికవాద్యధ్వానము
పవనోద్వేల్లితపల్లవపూరము
ఆడెడిఁ గల్పక మభినయసారము. 9

[అని నర్తించి) వలదు. వార్షికచిహ్నములచేతనే రాకు రాజోపచారములు ఇపుడు జరుగుచున్నవి. ఎట్లన,—

తే. మించుఁబోన్కించుమేఘుఁడె మేలుకట్టు,
వీచుఁ బూరెమ్మచామరల్ వేతసములు,
వందు లగు ఘర్మ మఱి నెలుం గొందుశిఖులు,
నెలసరులఁ గాన్క లిడెడు బేరు లగు గిరులు. ౬౮

కాని, ఇట్లు నాపరిచ్ఛేదమును శ్లాఘించుకొన్న నేమి ఫలము? ఈయడవిలోనే ఆ ప్రియను వెదకికొనను గాక.

[మాగధి చర్చరీపాదాంతమున భిన్నకము]

[గేయము]

అబలావిరహితుండు నతిదుఃఖితుండు
దైవము దూరుచు స్తంభితుండు
భూధరవనమున బుష్పోజ్జ్వలమున
గజరాజేం గెడి క్షీణగమనమున.

[చూచి] అయ్యో, వెదకం దొడంగినవాకు సందేహమువలె అయినది. ఏలన,

తే. గర్భజలము లారక్తరేఖములు నయిన
పుష్పములచేత నిడి నవభూమికదళి
కినుక నంతిరశ్రుపు లైననవనిలితకనుల
నుత్కలికతోడ స్మరియింప నూన్చె నన్ను. ౬౬

ఈదారిని పోయియుండినను అమహానియను ఎట్లు కనిపట్ట నగును?

తే. అనుగు లిలవిరాంద పోపె నే నానుగాత్రి
వానం దడియును పైనయావనశిలమున,
శ్రోణిధరమున మడంగులు క్రుంగం బోలు
యావకపుంజారుపదపంక్తి యగపడెడిని. ౬౭

[ద్విపదికచే] [పరిక్రమించిచూచి హర్షముతో] దొరకినది గుర్తు, దీనిచేత ఆకోపనమార్గమును ఊహింప నగును.

తే. మగ్ననాభి రుపాసంభ్రమగతి నరుపం
గాఱునశ్రుల మాపిరాగంపుగుర్తు
లైనది యిది శుకోదరశ్యామలంబు
చ్యుతము నిస్సంతిచుపు స్తనాంశుకము! బళి తే. ౬౮

[అరసి] ఏమి' ఇంద్రగోపములతో డికొత్తపచ్చికబయలు ఇది. ఈనిర్జనవనమున ప్రియావృత్తాంతము ఎట్లు తెలియును? [చూచి] ఆహా! జడివానకు ఉబ్బినశిలాజత స్థలిలో నిపాషాణము నెక్కి —

ఆ. తూర్పుగాలిజుట్టుం ద్రోచుచు నుండంగ
నంబుదముల నెమలి యుక్కెగాంచు,

గర్భమందుఁ గేక గ్రాలుకంఠంబును
సాఁగినంతపయికి సాఁచికొనుచు. ౧౯

[సమీపించి] దీని నడిగెదను.

[గేయము]



సంప్రాప్తపద్భారుఁ డై,
క్షుణహతపరేథవారుఁ డై,
కాంతాదర్శనలాలసుఁ డై,
కరిపతి విస్మితమానసుఁ డై. 11

[దానితో ఖండకాంతమున చర్చరి]

[గేయము]

కేకిసార్వభౌమ, లోకానందన, కేల్మోడ్చి నిన్ను వేఁడెదను,
ఈకానలోఁ గంటి వెందేని నా ప్రియఁ జెప్పుమి దయఁ బూనివెదను
వినవయ్య చెప్పెద వనితను గనిపట్ట స్పష్ట మయినయానవాలు,
రాకాచంద్రానన రాజహంసయాన యీపాటియే నీకుఁజాలు. 12

[చర్చరికచే కూర్చుండి ప్రాంజలి యై]

తే. కల దయా నాకు నుత్కంఠ కాలకంఠ,
ఆయతాపాంగ నోసితాపాంగ నీవు
చూచుకన్నోయి తనియనిసొగసుక త్తె
వనిత నొక్కతెఁ గంటివో వనతలమున. ౨౦

[చర్చరికతో చూచి] ఏమి? బదులు పల్కకయె నర్తింపఁ దొడంగినది! దీనికి హర్షకారణ మేమి! [చింతించి] కాని ఇది తెలిసినది.

ఉ. నాప్రియ కానరానికతన న్మృదువాతవిభిన్నబర్హ మై
యేపున నిస్సపత్నత వహించెడి నీయహిభోజి యిప్డు; హా
రా! ప్రియ కేశపాళి పురుషాయితకేళివిశీర్ణబంధ మై
ప్రాపితపుష్పదామముల భాసిల, మ్రోల ని దేఁటు సేయునో? ౨౧

కాని ఒకులవ్యసనముచే సంతసించెడిదీనిని అడుగను. [ద్విపదికచే దిక్కులు చూచి] [పరిక్రమించి] ఇది కోయిలకోమలి, ఎండల కనంతరము వదమేచి నేరేటి చెట్టున నెలకొన్నది. పక్షులలో ఈజాతి పండితము. దీనిని ప్రార్థింతునుగాక.

[అనంతరమున ఖురకము]

[గేయము]

విద్యాధరవనలీనుం డై,
విపులబాష్పనయనుం డై,
గజపతి యడలునఁ గలఁగుఁ,
గగనముఁ గొల్చుచు మెలఁగుఁ. 13

[ఖురకాంతమున చర్చరి]

సఖి ! సఖి

[ గేయము]

నందనవనిని స్వచ్ఛందగామినీ కలవాణి పికకామినీ,
నాతోఁ జెప్పవె నర్తిలి యొప్పంగఁ బ్రియఁ గంటివి నే నుపాంగ.

[దీనికై నర్తించి జలంతికచేఁ దతినీ మోఁకరించి] అమ్మా,

తే. కాముదూతి వటంద్రు గీర్ గామిజనులు,
మానహరణాప్రతిహతాస్త్రమంత్ర మీవు;
ప్రియతమను నాకడకు నేని వేగ తెమ్ము,
కొనుము కలవాణి నన్నేని కొమ్మకడకు. ౨౨

[*వాపుకముచే ఇందుక మరలి] ఏమనెదవమ్మా నీవు? 'నిన్ను ఇంత యనురక్తుని విడిచి ఎట్లు పోయినది?' అని అడిగెదవా? చెప్పెదను వినవమ్మా.

తే. కోప మూనిన దేని యాకోపమునకు
హేతు వొకటియు నాయందు నే నెఱుంగ;
ప్రియతములయం దొటను ననపేక్షితములు
ప్రభుత భావస్ఖలితములు భామినులకు. ౨౩

ఏమి! కథాచ్ఛేదము గావించి తనపనిలోనే చొచ్చినది.

తే. ఒరులవగ పెం తయినఁ జల్ల నుంట నిజమె,
ఇతుమహా లైననాయాచ్ఞ నెడఁగఁ ద్రోచి
అను నభినవపాక మియ్యది మదాంధ
రాజజంబూఫలము నఖరమును బోలె. ౨౪

ఇట్లయినను నా ప్రియుపతె మంజులస్వన యగుటంబట్టి ఈమెయందు నాకు కోపము లేదు. ఇచటినుండి నేను [ద్విపదికచే] [పరిక్రామితకము చేత చెవి యొగ్గి] అహో! దక్షిణమున ప్రియా చరణన్యాసమును అందించెలి. తెల్పుచున్నది కాని, అట లేదను. [పరిక్రమించి]

[గేయము]

దయితావిరహాశాంతపవనుఁడు,
అవిరళబాష్పనయనుఁడు,
శోకభారవిసంష్ఠులగమనుఁడు,
గురుతాపదీపితతనుఁడు,
కరిపతి దూరుఁడై గవి నున్నవాఁడు
కానలోఁ దిరుగుచున్నాఁడు. 15

[అని కకుభమాచే ఆలు ఉపభంగములు; అనంతరమున ద్విపదికచే దిక్కులు చూచి]

[గేయము]

ప్రియకరిణీవిశ్లేషితుఁడై,
గురుశోకానలదీపితుఁడై,
బాష్పజలాపిలలోచనుఁడై,
కరిపతి దిరుగు దీనాననుఁడై. 16

అయ్యో ఇసీ ఇసీ!

*క. జలదముల నిర్గ్గోనుది
క్కులఁ గన్గొని మానసమునకు సముత్సుకతఁ
వెలలెడిమదకలహంసల
కలరుత మిది, యందేరవలి గాదాయెఁ గటా! ౨౫

కాని. మానసోత్సుకము లయినయీపక్షులు సరస్సునుండి ఎగిరిపోకమును పే వీనివలన ప్రియావృత్తాంతమును తెలిసికొనవలయును. [వలంతిక చేత సమీపించి] ఓహో యి జలవిహంగమరాజా,

తే. పోవుదువు గాక మానసమునకు వెనుక,
వదలు బత్తెంపుబిసముఁ గొనెదవు పిదప,
తీర్రు గాక నాపగ ప్రియవార్త దెలిపి,
తనపనికి మున్నె కృతి షోపనిని జేయు. ౨౬

నీవు తల యెత్తి మిన్ను చూచుటచేత 'మానసోత్సుకుఁడను నేను చూడ నయితిని' అని పల్కెదవా? [కూర్చుండి చర్చట]

---

*క. ఘనముల నిర్ఘోషితకొనిదీరి। లను గని మానసమునకును లాలసతోడఁ
జనఁ గోరు రాజహంసునిస్వని। యిది మంజీరంజితము గాదు కటా!

[గేయము]

తస్కర, హంసా, దాఁతువు రా

[అని నర్తించి లేచి]

తే. సువదనను నాదుప్రియతమఁ జూచి తీవు
కొలనికరి నంచ, కానిచోఁ గొంటి వెట్లు
మదవిలాసపదముఁ దద్గమనము నెల్లఁ,
దెక్కలివి, లేదు కా దనఁ దెగువ గలవు. ౨౨

[గేయము]

గతిచేతనె నేఁ గంటిని రా.

[చర్చరికతో సమీపించి కేలు మోడ్చి] అందుచలననే

క. నాకొమ్మ నిమ్ము హంసను,
కైకొంటి తదీయ మైనకాంతగతంబుల్,
ఏకాంశము కనఁబడుచో
నీకొని యుభియుక్త మెల్ల నియ్యన వలయుల్. ౨౩

[మరల చర్చరి]

[గేయము]

తెలిచితి వెట నీగతి గతిలాలస ?
సకిని గంటివి పో జఘనభరాలస. 17

[మరల చర్చరి] 'నాకొమ్మ' ఇత్యాది పఠించి [ద్విపదికచే నిరూపించి] [విహసించి] ఇది దొంగలను దండించువాఁడు రాజు! అని భయముచేత ఎగిరిపోయినది. [పరిక్రమించి] ఇది యిట ప్రియాసమేతము చక్రవాకము. దీని నడిగెదఁగాక.

[అనంతరమున కుటిలిక]

[గేయము]

మర్కరసంకతకచారువున [మల్లఘటి—]
కుసుమితపల్లవితనరువున, [చర్చరి—]
దయితావిరహోన్మాదమున
కరిపతి భ్రమ్మరు గహనమున. 18

[ద్విలయాంతమున చర్చరి]

[గేయము]

గోరోచనాకుంకుమవర్ణాంచిత జక్కవరాణి నా ప్రియను,
ఆమనిపవల విహారకము సల్పఁగఁ గంటేని చెప్పుము దయను. 19

[చర్చరికతోఁ దతిసి హూఁకారించి.]

క. ఓయీ రథాంగ, యీరథి
ప్రేయసిఁ బాసెను రథాంగవిజయిశ్రోణిన్
నీయెడ ననుయోగంబున్
జేయు మనోరథశతంబుచే వృతుఁ డగుచున్. ౭౯

ఏమి! 'క: క:' అన్నదే, ఇది నన్ను తెలిసికో లేదా?

క. ఎవనికి రవియున్ శశియున్
దవుదురో మాతామహుఁడుఁ బితామహుఁడును నై,
ఎవని వరించిరో యిరువురు
ధవుఁగా స్వయ మూర్వరయును దా నూర్వశియున్. ౮౦

ఏమి ఊరకున్నది! కాని, దీనిని చీవాట్లు పెట్టెదను.

చ. సరసిని దామరా కొకటి చా టగుమాత్రన నీవు నీసకిన్
బొరయక దూర మేఁగె నని పొక్కుచుఁ బెల్లలుఁ గిత్తు, నీ కిటుల్
పరఁగుఁ బ్రియానురాగమునఁ బాసి వసించు భయంబు, ప్రేయసీ
విరహికి నాకు నీక్రియఁ బ్రవృత్తిపరాఙ్ముఖతన్ వహింతువే! ౮౧

ఎల్లప్రకారములను నాయదృష్టవిపర్యాసమే ప్రభావము సూపుచున్నది. వే అవకాశము చూచుకొనెదను. [పదాంతరమున నిలిచి] కాని, ఇటనుండి జరుగను. [ద్విపదికచే పరిక్రమించి, అవలోకించి]

ఆ. లోనఁ దేఁటి యులియఁగా నొప్పుసితమ్మి
యేఁగనీదు నన్ను నిచటు దలఁగి,
నేను మోవి చుఱుకుగా నొక్క సీత్కార
ముగ్ధ మైనకాంతముఖము వోలె. ౮౨

కాని, కమలాధ్యాసి యైనయీమధుకరమునుగూర్చియే యాచకుఁడ నయ్యెదను. ఇటనుండి పోయి పశ్చాత్తాపపడ నేల?

[దీని యంతరమున అర్ధద్విచతురస్రకము]

[గేయము]

క్రమవృద్ధగురుప్రేమరసంబున
ఆడుఁ గోడెహంస కామరసంబున 20

[చతురస్రకముచేతఁ దఱిపి కేలు మోడ్చి]

ఆ. మధుపమా, వచింపు మదిరాక్షివార్తను,

[విభావించి]

వలవ దీవు నాపై నసిగాఁ గనవు;
ఆపదపహాసులుగ్ర్యులఁ నాకు యూగించితి గాని,
ప్రతి గానదె పుంస్కోకిలుండు ? ౨౩

చనియెదను గాక. [స్వపదిక చేత] [పరిక్రామితకముచేత] వీఁడె కరిరాజు తొండము ఇప్ప మ్రాసిపలవమీఁదఁ బెట్టి కరేణుసమేతుఁడై యున్నాఁడు. ఇతనివలన ప్రియావృత్తాంతము నెఱిఁగెదను. [సమీపించెదను] [కటికచేత]

[గేయము]

దయితాపరిహారోత్తాపమున

[మల్లకాటి.]

గంధాక్తముఖుఁడు గహనమున 21

[దానియంతరమున] [మాఁచి] కొని, త్వరపడఁ గూడదు.

తే. అభినవోద్భిన్నదళములు నిభవిభుండు
ఆసవసురభిరసము హస్తాగ్రమునను
నోర వల్లభ యిడినయందుగుఁ బటుచు
ఆస్వదించును గాక సమగ్రముగను. ౨౪

[తుటమాత్రమునఁ జీ] అహా! ఇతఁడు అహ్నికమును నెఱవేర్చుచున్నాఁడు. మఱి యడిగెదను.

[గేయము]

చేమో ప్రిడెదను జెప్పుము గజపతి
లలితప్రమాణోశలితనృకుపతి,
దూరవిజితకములాంగకాంతిని
వీక్షించితె నా కేలు పూరింటిని ? 22

తే. మదకలుఁడఁ సుందరిని జాంద్రమునకలాభ,
యూధికాళిబలాలక యూథనాథ,
కానవే స్థిరయౌవన ప్రాణదయిత
హార్షదాలోక నోయి దీర్ఘాపిలోకి? ౨౫

[హర్షముతో] ప్రియాప్రాప్తిని నొప్పడియానిస్నిగ్ధగంభీరగర్జితముచేత గమాశ్వాసితుండ నైతిని. సాధర్మ్యముచేతఁ గూడ నీయందు నాకు ప్రేమ.

మ. ననుఁ బోషించు నృపాధిరాజని నినుఁ నాగాధిరాజంబుగాఁ,
గొన బాసికును దానధారధుని నాకుఁ యాచకౌఘంబునన్,
కొని నన్నుర్వశి నిన్ను సేవకయు ధన్యుం జేసి రిస్త్రీమణుల్,
కన నవ్వేలియునుం బ్రియావిరహదుఃఖం బొంద కీపుండుతన్. ౨౫

నీవు సుఖముండుము. నేను పోయివచ్చెదను. [పార్శ్వమున మండ్కి నిరీ
డించి] అహో! సురభికందర మనుపేరిట విశేషరమణీయము ఈకొండ యగపడు
చున్నది. ఇది అచ్చరలకు ప్రియ మైనదియా; నాసుతనువు దీనినెత్తమున దొరకునా?
[పరిక్రమించి చూచియు] అయ్యో' నాపాపములపంటచేత మేఘము శంపాశూన్యము
అయినది. అయినను ఈకొండను అడుగక నిన్ను త్రిల్లను. [అనంతరము ఖండిక]

[గేయము]

ఖరఖురదళితక్ష్మాతలుఁ డై,-వన-
గహనమునం దవిచేలుఁ డై,
పూని తనవని లీనుం డై,-కిరి-
దౌర చను ముదధీనుం డై. 23

తే. పృథునితంబుండ నీవు నాపృథునితంబ
సంగతానంగ శృంగారమంగళాంగ
పర్వసన్నత నోయి పర్వతవిభుండ
యణుకుచాంతరఁ గంటె వనాంతరమున. ౨౬

ఏమి ఊరక యున్నది! దూరముచేత నామాట వినఁబడలే దని శంకించెద.
సమీపమునకుం బోయి యడిగెదను. [అనంతరము చర్చరి]

[గేయము]

స్ఫటిక శిలాతల భాస్వర నిర్ఝర
బహువిధ సుమనో భర చితశేఖర
కిన్నరమధు రోద్గీత మనోహర
కనఁబడుపుము నాకాంతను భూధర. 24

[అని][పరిక్రమించి] [అంజలి సేసి]

తే. సర్వభూభృదధిప సర్వాంగసుందరి
రామ సన్నుతాభిరామకమునఁ
గానవాంతరమునఁ గానంగఁబడియెనే
నాకుఁ బాసినయది నీకుఁ బ్రియుఁడ. ౨౭

[ఆకర్ణించి, హర్షముతో] ఏమి యథాక్రమముగా 'చూచితిని' అని పలికినది. నీవును ఇంతకన్న ప్రియతరమును విందువుగాక. అటయిన నా ప్రియతమ యెటనున్నది? [నేపథ్యమున అదే వినఁబడును] హా! ఇస్సీ! నా శబ్దమునకే గుహాముఖమునుండి వెలువడిన ప్రతిశబ్దము [విషాదమును రూపించి] బడలితిని. ఈ సెలయేటిదరిని నిలిచి, అలల గాలిని అనుభవించెద. క్రొత్తనీటిచేత కలఁగినదాని నైనను ఈ యేటిని చూచుటచేత నా హృదయము ప్రీతి నొందుచున్నది.

ఉ. వీచులు గాఁగ భ్రూకుటులు, పక్షిగణదండజపంక్తి కాంచిగా,
వే చన జాలుపైఁటపలె ఫేనచయంబిటు నట్టు నీడ్చుచున్,
ఏచినమేటిసంస్ఖలిత మెంచుచు క్షిప్రపదప్రయాతనై,
నా చెలి యోర్పు లేక పరిణామము నొందె నదీస్వరూపతన్. ౨౯

కాని, దీనిని యాచించెదఁగాక. [అనంతరము కుటిలిక]

[గేయము]

దయ గొనుమా ప్రియతమ సుందరి నది,
క్షుభితాకరుణశకుంతికా, నది,
ద్యోసరిత్తటసముత్సుకా, నది
కల మధుకర ఝంకారితా, నది. 25

[కుటిలికాంతమున చర్చరి]

[గేయము]

ప్రథమది శాపవనహతి ♦ ప్రబలోర్మికోర్ధ్వభుజముల
నర్తించు సలలితుఁ డుదధి ♦ నాథుఁడు మేఘాంగముల
శకటాంగహంసకుంకుమ ♦ శంఖకృతమండనముల
కరిమకరాకులకృష్ణ ♦ కమలకృతావతంసముల
తటసలిలోద్వేల్లిత ♦ దత్తహస్తతాళుండు
అవతరించెడి దశాశల ♦ నలమున వాబ్దకాలుండు. 26

[అని దఱిసి] [కేలు మోడ్చి]

తే. ప్రియమె పల్కితి, నీయందె ప్రీతి యిడితిఁ,
బ్రణయభంగవిముఖభావపరత నుంటి;
నే నెడపరాధలేశంబు నీవు గంటి?
దాను నను విడనాడితి వేసుఁ బూని. ౩౦

కాక, ఇది వాస్తవనదియే గానయ్యెను, ఊర్వశి పురూరవుని వదలి సముద్రుని

అభిసరింపను గదా. అనిర్విణ్ణతచే శ్రేయస్సులు కలుగును. కాని యెచట సువదన నా కంటికి గనఁబడక దిచ్చు మొగమయినదో, అచ్చోటికే యేఁగెదను. [పరిక్రమించియును చూచియు] ఆహా! ప్రేయసిమార్గముయొక్క గుర్తు కనఁబడినది.

ఆ. ఎఱ్ఱకడపపువ్వు మిది, దీనిఁ బ్రేయసి
సిగను దోఁడవుగాఁగఁ జెరివికొనియె
ఎండకారుతుదను హెచ్చరించెను నని
యలయకరుల విపను మైనను ధృతిఁ. ౯౧

[విలోకించి] పడుండియున్న యీ సారంగమును ప్రియావృత్తాంతముకై ప్రార్థించెదను.

[గేయము]

నూతనకుసుమస్తబకమండితా ♦ నోకహాపర్యంతమున
మదకలకూజితకోకిలఝంకృ ♦ న్మధుకరమనోహరమున
ప్రాణాధికనిజకరిణీవిరహ ♦ జ్వాలాంకృతతాపమున
విచరించెడి నైరావతద్విపము ♦ వేల్పులయుద్యానమున. 27

[గళితకము, మోఁకారించి]

తే. కృష్ణసారప్రభం బిది కేరు నిచటఁ
గనులపండువు నభినవఘూసపటలిఁ,
గాననేందిర తాఁ దమకమునఁ జూడఁ
జాఁచినట్టినిడుద్దకటాక్షం బనంగ. ౯౨

[విలోకించి] ఏమి యిది! నన్ను శిరకు సేయనిచ్చుట్లు పెడమొగం బయినది. [చూచి]

క. కన దీని వచ్చుహారిణిని
జను గుడువఁగ లేఁగ నడుమఁ జయ్యన నిలువన్,
అనితరదృష్టుల నిదియున్
గను దానిని తాను భుగ్నకంఠం బగుచున్. ౯౩

[అని వర్తించి, చర్చరీ]

[గేయము]

వేలుపుభామిని జఘనభరాలస పీనోత్తుంగస్తనియు
స్థిరయౌవనయుఁ దనుశరీరయు క్రీలహంసగతియు
మింటి నొరయు కాననమునఁ దిరుగుచు మృగనేత్రఁ గంటివ యేని
నాకుఁ బలికి యీవిరహాబ్ధిఁ బడిన ననుఁ దేల్పును యీఁగనేని. 28

[లతిని కేలు మోడ్చి] ఓహోయి కకుప్నాయకుఁడా,

తే. కంటివో నా ప్రియను నీవు కాననమున ?
మానినికి విను చెప్పెద నానవాలు ;
నీవయితె యీమె యెల్లా యొప్పె దలియును
సొబగురాలు పృథులనేత్ర సుమ్ము మిత్ర. ౨౪

ఏమి నామాటను ఆదరింపక పెండ్లామువైపు మొగము త్రిప్పుకొన్నది! న్యాయ్యమే. దశావిపర్యాసము పరిభవాస్పదము. ఇటనుండి నేను—[పరిక్రామితకముతో చూచి] ఇది యెట్టిది రాతిపగులులో కనఁబడుచున్నది ?

ఉ. కాదు మృగేంద్రకృత్తకరిక్రవ్యలవంబు, ప్రభాప్రలేపి గా ;
కాదు వెలుంగువిస్ఫులింగముఁ, గాన సముత్థముఁ దోఁగె వానచే ;
[పరికించి]
ప్రోదిగ రక్తవంజులముఁ బోలెడి రక్తిమఁ, బద్మరాగ మౌ ;
నాదట దీని నెత్తవలె నర్కుఁడు దాఁ గమిచెం గరంబులన్. ౨౫

ఇది నామనస్సును కారించుచున్నది.

[గేయము]

ప్రణయినీబద్ధాకాంక్షుండు
బాష్పాకులనిజాక్షుండు
గజపతితిరుగు దుఃఖాన
తామితాస్యుఁడు కానలోన. 29

[ద్విపదికచేఁ దరిసి, తీసికొనుటను నటించుచు] దీనిం గైకొనియెద. అయినను ఏల యిది.

తే. ఎవతుకకుఁ బారిజాతంపుఁబువుల గావి
గుబులుకొనుసిగలో దీనిఁ గూర్పఁ దగునో
ఆమనోనాయిక యలభ్య యయ్యె; నింక,
నశ్రునిపాతంబు దీనిఁ జేకొనంగ నేల ? ౨౬

[నేపథ్యమున-వత్సా! పుచ్చుకో పుచ్చుకో.

క. ఇది సంగమనీయాఖ్యన్
గదితం బగుమాణికము, నగసుతచరణ
పదరాగజనిత ; మిది గా
ల్చ దయితజనసంగమంబు వరఁగున్ దోడ్తోన్.] ౨౭

తే. కందు నేఁ దొల్త దేని నాలికిఁ గాఁగ,
నిముసమున నదె వే అయి నెగులు గొల్పె ;
కాన స్పర్శవిభావితఁ గాంత దీనిఁ
గనఁగఁ దెఱవను దెఱవను గన్నుఁగవను. ౧౦౦

[మెల్లఁగా కన్ను దెఱచి] ఏమి ! సత్యముగా ప్రియతమయే !

ఊర్వశి.—[బాష్పములు విడిచి] జయం జయం నీకు మహారాజా.

రాజా.—

తే. తమసమున భవద్వియోగజాతమునఁ జండి,
మునిఁగి యుండు గంటుచున్న నావసట దీఱ
భాగ్యవశమున వెండి నిన్నడసినాఁడ,
నవగతాసుండు చేతన నందినట్లు. ౧౦౧

ఊర్వశి —మహారాజా, అలాగే; అంతఃకరణంచేత నీవృత్తాంతాన్ని సాక్షాత్కరిస్తూనే వుంటిని.

రాజా.—అంతఃకరణముచే నన్నమాట నాకు బోధపడకున్నది.

ఊర్వశి.—విను. ఇందుకు మహారాజా నన్ను క్షమింపవలెను. ఎందు కనగా, నేను కోపవశనై మహారాజును ఈయవస్థాంతరము పొందించితిని.

రాజా.—కల్యాణీ, నన్ను ప్రసన్నుం జేయ నక్కఱలేదు. నిన్నుఁ గన్నంతనే నాయాత్మ ప్రసన్నబాహ్యాంతఃకరణ మయినది. చెప్పుము చెప్పుము. ఇంతకాలము నేను లేక నీవు ఎట్లు ఉంటివి ?

[అనంతరము చర్చరీ]

[గేయము]

అసితకంఠముఁ, బికి, నంచ, రథాంగము...
దువె...

శాపవిమోహితాత్మనై దేవతావిధిని మఱచి నీయనునయాలకు లోఁగక ఈ కుమారవనాన్ని చొచ్చితిని. చొచ్చినంతనే బండిగురివెందతీవ నయితిని.

రాజు.—సర్వము ఉపపన్నము.

క. నను సురతఖేదసు ప్తుని
వనిత విదేశగతుఁగాఁగ పగచెదు సిగ్గున్,
ఎన లేని యీచిరవియు
క్తి నీదృశము నెట్టు లోర్చితివి చెప్పు సఖీ. ౧౦౨

నీవు చెప్పినయీమణిని నీసంగమకారణమును మునివలనం బొంది మణిప్రభావమున నిన్ను మరల నేను పొందితిని. [అని మణిని చూపును.

ఉర్వశి.—అహో! సంగమనీయము! అందుచేతనే కదా మహారాజు నన్ను కౌగిలించినమాత్రాన తొంటిరూపు పొందితిని. [మణిని కైకొని ఔదలం దాల్చును.

రాజు.—సుందరీ, ఇట్లె క్షణమాత్ర ముండుము.

క. నుదుటం బెట్టినయీమణి
నుదయించినరాగ మొలయ నొప్పారెడి నీ
వదనము లేయెండకుఁ గెం
పొదవిననెత్తమ్మిలక్ష్మి కుపమానంబై. ౧౦౩

ఉర్వశి.—ప్రతిష్ఠానమునుంచి నీవు వచ్చి చిరకాల మయినది. ప్రకృతులు నాపై అసూయ వహింతురు. కావున మరలుదాము.

రాజు.—నీ వాజ్ఞాపించినట్లు.

ఉర్వశి.—మహారాజు ఎట్లు పోగోరును.

రాజు.—

క. స్ఫురియించుమించు సిడముగ
సురచాపము నూత్నచిత్రశోభగఁ గ్రొమ్మ
బ్బు గ్రహించువిమానముఁ జే
సి రయంబున నన్ను వసతిఁ జేర్పుము తరుణీ. ౧౦౪

[చర్చరి]

[గేయము]

సహచరితోడను సంగతుఁడై
అఖిలగాత్రపులకాంకితుఁడై

స్వేచ్ఛాప్రస్తవిమానమున
హంసయువ చను విహారమున. 32

[అని ఖండధారచే నిష్క్రమింతురు.

(చతుర్థాంకము సమాప్తము.)

---

# పంచమాంకము.

[అంతట పరితుష్టుఁడు విదూషకుఁడు ప్రవేశించును.]

విదూ.—సంతోషం సంతోషం! చిరకాలము ఊర్వశీసమేతుఁడై నందనవనం మొదలైన దేవతారణ్యాదులలో విహరించి ప్రియవయస్యుడు మరలి వచ్చినాడు. ఇప్పుడు సత్కారోపచారాలతో ప్రకృతులచేత అనురంజనం పొందుతూ రాజ్యము చేస్తూ వున్నాడు; సంతానము లేమి తప్ప అతనికి ఏకొఱంతా లేదు. ఈదినము తిథివిశేషమని గంగాయమునాభగవతుల కూడలిలో దేవేరులతో స్నానమాడి రాచగూడారం ప్రవేశించినాడు. కనక అతనియలంకరణసమయంలో తొలివాడ నౌతాను.

[అని పరిక్రమించును.

[నేపథ్యమున]

అయ్యో! అయ్యో! విసనకఱ్ఱమీద తెల్లపట్టువస్త్రంమీద ఉంచి తీసికొనివెళ్లుతున్నదానిని అంతఃపురవిలాసినులు మౌళిలో ధరించడానికి యోగ్యమయిన మణిని ఎరచిభ్రమచేత గద్ద తన్నుకొనిపోయింది.

విదూ.—[చెవి యొగ్గి] అక్కటా! అక్కటా! అది సంగమనీయమనే చూడారత్నము, వయస్యునికి అత్యంతం ప్రియంగదా. అందువల్లనే గదా అయన ముగియని నేపథ్యములోనే ఆసనమునుండి లేచి ఇటే వస్తున్నాడు. ఇతనిని కలసికొంటాను.

[అంతట ససంభ్రమపరిజనుఁడు రాజు ప్రవేశించును.]

రాజు.—

తే. ఎక్కడను జూపుమా పక్షి తెక్కలీఁడు?
ఎవఁడు ప్రాణంబు చేఁదయి మృత్యు వెనయు
తన మొదలిచోరకృత్యంబు దా నొనర్చె
శౌనకునియింటనే పటుసాహసమున. ౧౦౫

కిరాతి.—ఇదుగో ఇదుగో, నోటికొనను తగుల్కొని వున్న బంగారపుదారములోనిమణితో ఆకాశాన్ని చిత్రిస్తూవున్న దనేలాగ సుడుస్తున్నది.

రాజు.—నాకును కనఁబడుచున్నది.

తే. నోర మణిప్రేలుజాఱువాదార మొప్ప,
మింట వడి మండలముల భ్రమించుకతనఁ,
గొఱవి గిఱగిఱఁ దిరిగెడి తెఱఁగు దోఁప
రాగరేఖావలయము లేర్పఱుచుఁ బులుఁగు. ౧౦౬

ఇప్పుడు ఏమి చేయవలయును ?

విదూ.—[సమీపించి] దీనిమీద కనికరింపరాదు. ఇది అపరాధి దండనీయము.

రాజు.—నీవు చెప్పినమాట సరి. విల్లు విల్లు విల్లు!

[ధనుర్గ్రాహిణి యవని నిష్క్రమించును.

రాజు.—వయస్యుఁడా, పక్షి అగపడలేదే.

విదూ.—ఇటనుండి దక్షిణపుతుదమీదుగా పోయినది దండనీయమైన పీనుగు మేతరి.

రాజు.—[తిరిగి చూచి] ఇప్పుడు కనఁబడుచున్నది.

తే. నిగ్గు లివురులఁ బోలుమానికముచేత
వంజుళపువిరిగుత్తిచే బలె ఖగంబు
దిగ్వధూవక్త్రమునకు సాధించెఁ జూడఁ
జారుతరము వతంసప్రసాధనంబు. ౧౦౭

యవని.—[చాపహస్త ప్రవేశించి] ప్రభూ, ఇదిగో, విల్లు, అమ్ముకూడ.

రాజు.—ఇఁక నిపుడు వింటితోడన నేమి కార్యము. ఆ పాలతిండి బాణమార్గమును దాఁటిపోయినది. అట్లే గదా.

తే. ఖగము దవ్వగఁ గొనిచన్న కారణమున
మెఱసెడిని మానికం బది మింట నిపుడు,
పరుషజలధరచ్ఛేదంబుదరిని రాత్రిఁ
గ్రాలుచుండునంగారకగ్రహము వోలె. ౧౦౮

[అంగజాలను గాంచి] లాతవ్యా, మామాటగా చెప్పుము నాగరికునితో. సాయంకాలమున నివాసవృక్షమును చేరునీదొంగపక్షిని వెదకు మని.

కంచుకి.—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

విదూ.—ఇప్పుడు నీవు కూర్చుండుము. ఈరత్నపుదొంగకు ఎక్కడికి పోతే నీ శాసనము తప్పుతుంది ?

రాజు.—[విదూషకునితోఁ గూడ కూర్చుండి] వయస్యా,

క. రతన మ్మని గాదు పతిగ
హృతమునకై నా ప్రయాస, హృదయసఖీసం
గతుఁ జేసి చేసె ననుఁ బ్రా
ణితు సంగమనీయ మనుమణి యిది వయస్యా. ౧౦౯

విదూ.—ఈయర్థమును పూర్వమే నాకు చెప్పియున్నావు.

[అంతట బాణమును మణిని తెచ్చుచు కంచుకి ప్రవేశించును.]

కంచుకి.—జయము జయము దేవరకు.

క. రోషత నొందననీయా
కోపముచే వ్రస్సి ఫలుఁగు కూలెను మణితోఁ,
బ్రాపించి నేరమున కను
నూపం బగుపథము ధర్మరూఢిగ దేవా. ౧౧౦

[అందఱు ఆశ్చర్యము రూపింతురు.

కంచుకి.—నీటిలోఁ గడిగిన యీమణిని ఎవరిచేతి కిత్తును ?

రాజు.—కిరాతీ, దీనిని అగ్నిశుద్ధము గావించి పెట్టెలో నుంచుము.

కిరాతి.—ఏలినవారియాజ్ఞ. [అని మణిం గొని నిష్క్రమించును.

రాజు.—లాతవ్యా, ఈబాణము ఎవనిదో నీ వెఱుఁగుదువా ?

కంచుకి.—చెక్కినపేరు కనఁబడుచున్నది, గాని నాదృష్టికి అక్షరములను కనిపట్టుశక్తి లేదు.

రాజు.—అటయిన ఆబాణము ఇటు తెమ్ము. [కంచుకి అట్లు చేయును.

[రాజు నామాక్షరములం జదువుకొని సంతోషవంతుఁ డయినట్లు రూపించును.

కంచుకి.—నాపని నేను చూచికొనెదను. [అని నిష్క్రమించును.

విదూ.—ఏమి విచారిస్తున్నావు ?

రాజు.—విను మతి ఏసినవాని పేరియక్షరములను. [చదువును]

తే. ఔర్వశేయుండు విలుదాలు పైలసూతుఁడు
ఆయువు కుమారుఁ డనఁగలో నతిబలుండు
అతనిది యని మోలుఁగుఁ డీశరాశుగంబు,
అపహరించును బగతురయాయువులను. ౧౧౧

విదూ.—[పరితోషముతో] ఆహాహా ! నీవు సంతానవంతుడవై వర్ధిల్లుచున్నావు !

రాజు.—సఖుఁడా, ఇది యెట్లు ? నైమిశేయ యాగ సమయమునఁ దక్క

నేను ఊర్వశిని ఎడఁబాయలేదు, నేను గర్భవ్యక్తిని కనిపట్టియేని యుండలేదు. మఱి ప్రసవమే ఎట్లు? అయినను,

క. నలు పెక్కెను జన్ను మొనల్,
తెలుపెక్కెను లవలిదళము తెఱఁగున మొగముల్,
చెలువ కొకకొన్ని దినములు
వలయంబులు జాఱినట్లు వపువు దలిర్చెన్. ౧౧౨

విదూ.—నీవు దివ్యస్త్రీలకి అన్నిటను మానుషీధర్మమే అని తలచకు. వారి చరితములు ప్రభావముచేత దాగియుండును.

రాజు.—కాని నీ వన్నట్లే అగునుగాక. మఱి పుత్రుని దాఁచుటలో ఆమహాశయకు కారణ మేమి?

విదూ.—దేవతారహస్యములు ఎవరు గర్హించగలరు?

కంచుకి [ప్రవేశించి].—జయము జయము దేవరవారికి. దేవరా, చ్యవనాశ్రమమునుండి కుమారుం దోడ్కొని దేవరను గాంచుటకై తాపసి వచ్చియున్నది.

రాజు.—ఇరువురను అవిలంబితముగా ప్రవేశపెట్టుము.

కంచుకి.—దేవరయాజ్ఞ. [అని నిష్క్రమించి చాపహస్తుఁడగు కుమారుని తోను తాపసితోను ప్రవేశించును

కంచుకి.—అమ్మా ఇటుఇటు. [అందఱు పరిక్రమింతురు.

విదూ.—[చూచి] ఏమి? గద్దను గుఱిపెట్టి రేసిన ఆ అర్ధనారసాన చెక్కిన పేరివాడు అత్రిక్రికుమారుడు ఇతఁడేనా? అట్లే; నిన్ను బహుతరంగా పోలియున్నాడు.

రాజు.—అట్లే ఉండును. అందువలననే—

తే. అశ్రు లుబుకును వీనిఁ గన్నంతఁ గనుల,
స్వాంతమునఁ బ్రేమ, మదిని బ్రసాద మొలయు,
గళితధైర్యుఁడ, వడఁకునంగములతోడ
నదయముగఁ గౌఁగిలింపఁ గోరెదను వీని. ౧౧౩

కంచుకి.—భగవతీ ఇట్లుండుఁడు. [తాపసీకుమారులు అట్లే ఉందురు.

రాజు.—అమ్మా నమస్కారము.

తాపసి.—మహారాజ, సోమవంశవర్ధనుఁడవు కమ్ము. [ఆత్మగతము] అహో చెప్పకుండనే తెలియుచున్నది. ఈరాజర్షికి వీనితోడియౌరససంబంధము [ప్రకాశము]

బాలకా, మీనాయనకు మ్రొక్కుము.

[కుమారుఁడు చాపగర్భముగా అంజలి సేయును.

రాజు.—ఆయుష్మంతుఁడవు కమ్ము.

కుమా.—[ఆత్మగతము]

ఆ. ఇతఁడు నాయన యని సుతుఁడను నే నని
వినఁగ నిట్టి ప్రేము ప్రిదిలె నెదను;
ఒకుల యుందుఁ బెరుఁగుబుడుత కెంతటిప్రేము
గురువు దేఉుకొనదొ గురులమీఁద ? ౧౧౪

రాజు.—భగవతీ, ఏప్రయోజనమునకై మీరాక ?

తాపసి.—వినుము మహారాజా, ఈదీర్ఘాయువును ఆయువును పుట్టినప్పుడే ఉర్వశి ఏనిమిత్తముననో నాచేతిలో ఇల్లడ యుంచినది. క్షత్త్రియకుమారునికి పలసిన జాతకర్మాది విధానమును సర్వమును ఇతనికి భగవానుఁడు చ్యవనముని గావించినాఁడు. ఇతర విద్యలం నేర్పి ధనుర్వేదమందును నేర్పరిం గావించినాఁడు.

రాజు.—సనాథుఁడ నైతిని గదా.

తాపసి.—ఇప్పుడు పుష్పసమిధలకొఱకు ఋషికుమారులతోఁ గూడ ఇతఁడును వచ్చి ఆశ్రమవిరుద్ధ మాచరించినాఁడు.

విదూ.—[ఆవేగమునో] ఏలాగు?

తాపసి.—మాంసము తెచ్చుకొని గద్ద చెట్టుకొనను వాలు చుండఁగా వీఁడు దానిని కోలకు గురిచేసినాఁడు. [విదూషకుఁడు రాజును చూచును.

రాజు.—తర్వాత తర్వాత ?

తాపసి.—అంతట అవృత్తాంతము నెఱింగి భగవంతుఁడు చ్యవనముని న న్నాజ్ఞాపించినాఁడు:—'నీచేతియీయిల్లడను పంపివైవుము' అని. కావున, దీనిని ఉర్వశిని మాడఁగోరుచున్నాను.

రాజు.—అటయిన, అమ్మగారు కూర్చుండ ననుగ్రహింపవలయును.

[తెచ్చియుంచినయాసనములో తాపసి కూర్చుండును.

రాజు.—లాతవ్యా, ఉర్వశిని పిలుచుకొనిరా.

కంచుకి.—దేవరయాజ్ఞ. [అని నిష్క్రమించును.

రాజు.—[కుమారుం గాంచి] రా రమ్ము వత్సా ;

తే. సుతతనుస్పర్శ సకలాంగహిత మటంద్రు,
గాన నాదుకుమారక దాని నొసఁగి
నన్ను నాహ్లాదభరితు నొనర్పు వేగ
కాంత మిందుకర మ్మిందుకాంతము బలె. ౧౧౫

తాపసి.—జాతా, నాయనకు అనందము సేయుము.

[కుమారుఁడు రాజును దఱిసి పాదమూలం బట్టుకొనును.

రాజు.—[కుమారుని కౌఁగిలించి, పాదపీఠమునఁ గూర్చుండఁ బెట్టి, ఇతనిని నీతండ్రికి ప్రియసఖుని బ్రాహ్మణుని అశంకితముగా ప్రణమిల్లుము.

విదూ.—ఏల శంకిస్తావు? శాఖామృగము ఆశ్రమవాసమున పరిచితమే.

కుమా.—[చిఱునవ్వుతో] బాబూ, నమస్కారము.

విదూ.—నీకు స్వస్తి.

[అంతట ఊర్వశియు కంచుకియు ప్రవేశింతురు.]

కంచుకి.—ఇటు ఇటు దేవి.

ఊర్వశి.—[కుమారుం గాంచి] ఎవ రితఁడు? కేల వి ల్లున్నది, మహారాజు స్వయంగా పాదపీఠాన పిల్లజుట్టు ముడుస్తున్నాడు. [తాపసిని గాంచి] అహా! సత్యవతితోటి నాపుత్రకుఁడు ఆయువు; పెద్దవాఁ డయినాఁడు. [పరిక్రమించును.]

రాజు.—[ఊర్వశిం గాంచి]

క. చనుదెంచెను గౌతుకమున| నినుఁ గని కనుఁబండు వొంద నీజనని సుతా,
అనురక్తి మెయిం జేఁపిన| చనుఁగవపాలకుఁ దడిసినచనువలిపముతోన్.

తాపసి.—జాతా, రా, లేచి అమ్మకు ఎదు రేఁగుము.

[కుమారుఁడు ఊర్వశికి అభ్యుద్గమనము సేయును.

ఊర్వశి.—అమ్మా, నీపాదములకు మ్రొక్కెదను.

తాపసి.—బిడ్డా, భర్తకు బహుమతవు కమ్ము.

కుమా.—అమ్మా, అభివాదనము చేసెదను.

ఊర్వశి.—[కుమారుని ఉన్నమితముఖుని కవుంగిలించి] వత్సా, నాయనను ఆరాధించువాఁడవు కమ్ము. [రాజును దఱిసి] జయము జయము నీకు మహారాజా.

రాజు.—పుత్త్రివంతురాలికి స్వాగతము. ఇట కూర్చుండుము.

[అర్ధాసన మొసంగును.

[ఊర్వశి కూర్చుండును. అందఱు యథోచితముగా కూర్చుండురు.

తాపసి.—ఓసివత్సా, ఈతఁడు ఆయువు విద్యలు నేర్చినాఁడు, ఇప్పుడు కవచధరుఁ డయినాఁడు. కావున ఇదె నీ వుంచినచేతియిల్లడను నీభర్త సమక్షమున నీకు అప్పగించి వైచితిని. నాకు సెల విండు; నేను పోయివచ్చెదను. నా యాశ్రమధర్మము నిర్బంధించుచున్నది.

ఊర్వశి.—చిరకాలానికి ఆర్యను చూచి బొత్తిగా తనివితీఱకున్నాను. పోయి రమ్మననేరను. నిర్బంధించి నిలపడం న్యాయంగాదు. కనక ఆర్యా పోయిరా, మళ్లీ దర్శనం కలుగును గాక.

రాజు.—అమ్మా, భగవంతునికి చ్యవనమునికి నా ప్రణామమును నివేదింపుము.

తాపసి.—ఆజ్ఞ చేసెదను.

కుమా.—ఆర్యా, నిజముగా పోదువేని నన్నుకూడ ఆశ్రమమునకు కొని పొమ్ము.

రాజు.—ఓయి బాలకా, ప్రథమాశ్రమమున అటనే యుంటివి. ఇప్పుడు రెండవయాశ్రమమునం బ్రవేశించుటకు నీకు సమయము.

తాపసి.—జాతా, పితృవాక్యమును పాలింపుము.

కుమా.—అటయిన,

క. నాయొడిలోఁ జూడాకం, డూయననుఖను ప్త మయ్యెదుర్ల శితికంఠం,
బోయనఁబురిమొలచినయా, నాయర్మిలినెమలిబోదనాకుఁ బనుపుమా.

తాపసి.—[విహసించి] ఆజ్ఞ చేసెదను. మీకు స్వస్తి యగుఁగాక.

[అని నిష్క్రమించును.

రాజు.—కల్యాణీ.

క. ఈనీదుసుపుత్త్రునిచే। నైనాఁడను బుత్త్రవంతు లందఱిలోనన్
నే నగ్రగణ్యుఁడ। శచీ,సూనుఁ డగుజయంతుచేత సురపతిబోలెన్.౧౧

[ఉర్వశి స్మరించి ఏడ్చును.

విదూ.—ఏమి యిది? ఈ మహానీయురాలు ఒక్కుమ్మడిని అశ్రుముఖి యయినది?

రాజు.—[సావేగము]

తే. చెలియ యే ల్తేల నేఁ గులస్థితిని బొంది
హర్షవారాన్నిధిని నోలలాడుచుండ,
నిండుపాలిండ్ల కురలుకన్నీటిధార
మించుముత్తెసరుల నిన్మడించు నట్లు. ౧౧౯

[అని ఆమెయొక్క కన్నీళ్లను తుడిచివైచును.

ఉర్వశి.—చిత్తగింపుము మహారాజా. మొందల పుత్త్రదర్శనముచేత మఱచి ఉంటిని, ఇప్పుడు మఱి మహేంద్రసంకీర్తనముచేత ఏర్పాటు వాగుండెను తల్లడ పెట్టుచున్నది.

రాజు.—ఆయేర్పాటును చెప్పుము.

ఉర్వశి.—పూర్వము నన్ను మహారాజగృహీతహృదయను మహేంద్రుడు అజ్ఞాపించెను.

రాజు.—ఏ మని?

ఊర్వశి.—"ఎప్పుడు ఈతఁడు నా ప్రియసఖుడు రాజర్షి నీయందు జనించిన వంశకరుని ముఖము చూస్తాడో అప్పుడు నీవు మళ్లీ నా సమీపానికి రావలశినది" అని. అందువల్ల నేను మహారాజవియోగానికి వెఱచినదాననై జాతమాత్రుని వీనిని విద్యాప్రాప్తినిమిత్తమై చ్యవనభగవంతునియాశ్రమ పదంలో సత్యవతమ్మచేతిలో అప్రకాశంగా ఇల్లడ వుంచితిని. ఇప్పుడు తండ్రిని కొలవడానికి సమర్థుడయినాడని ఆలోచించుకొని ఆమె మళ్లీ నాకు దీర్ఘాయువును అప్పగించింది. కనక నాకు ఇంత పాటియే మహారాజుతోటి సంవాసము. [అందఱు విషాదము రూపింతురు.

రాజు.—[నిట్టూర్పుతో] అహో! దైవముయొక్క సుఖవిరోధిత!

తే. ఆశ్వసిలితినో లేదో పుత్త్రప్రాప్తిచేత,
వెంటనే, నను సకిరో, నీవిరహ మంటెఁ;
ప్రథమవృష్టికి నాతపజ్వర మెడసిన
వృక్షము నిరమ్మదపువహ్ని యేర్చినట్లు. ౧౨౦

విదూ.—ఈయర్థము అనర్థానుబంధి యయినది. నాకు తోస్తుంది ఈయన ఇక మీద నారచీరలు ధరించి తపోవనాన్ని సేవించవలశినదని.

ఊర్వశి.—కృతవిద్యుణ్ణి పుత్త్రుణ్ణి బడసి మహారాజు మందభాగ్యను నన్ను స్వర్గానికి పో సెలవిచ్చి కృతార్థనుగా భావింపవలెను.

రాజు.—వలదు వలదు.

చ. తనకుఁ బ్రియంబు సేసికొన దఱతఁ జెందదు నాథవంత మా
జనము వియుక్తిభాజనము, సల్పుము నీ వధినాథునానతిన్;
నిను నెడఁ బాసి యీబుడుత నీసుతు రాజ్యమునందు నిల్పి నే
వనముల నాశ్రయింతు సకి, వన్యమృగంబులె సంగడీలుగాన్. ౧౨౧

కుమా.—మేటివృషభము మోచినభారమును లేఁత కోడెమీఁద మోప్రట నాయనకు తగవుగాదు.

రాజు.—ఓయి వత్సా,

చ. కలభము యయ్యుసుం జమువు గంధగజం బితరద్విపంబులన్,
వెలయును ద్రాఁచుఁగందువిషవేగము తీవ్రతరంబుగాఁ గడున్,
ఇల నెకిమీఁడు బాలకుఁడ యేనియు నేల సమర్థుఁడే యగున్,
వలదు వయస్సు, పుట్టుకనె వర్గ మి దాత్మకృతిక్షమంబగున్. ౧౨౨

లాతవ్యా, నామాటగా అమాత్యపరిషత్తునకుం జెప్పుము. ఆయువునకు రాజ్యాభిషేకసంభారములను సమకూర్పుఁడని.

కంచుకి.—దేవరయాజ్ఞ. [అని దుఃఖితుఁడై నిష్క్రమించును.

[అందఱు కనులు మిఱుమిట్లుగొనుటను రూపింతురు.

రాజా.—[ఆకాశముం గని] ఏమి యిది! మేఘములేకయే మెఱుపుల మొత్తము పడుట!

ఉర్వశి.—[విలోకించి] అహో! భగవంతుఁడు నారదుఁడు.

రాజా.—అహో! భగవంతుఁడు నారదుఁడు! ఈయన

చ. జడగుమి గోరజంపుననికషంపుఁబిశంగిమతో విరాజిలన్,
గడలుకొనంగ జన్నిదము కైరవబంధుకలాములచ్ఛవిన్
దొడిగినతారహారములు తోరపుఁగాంతిని గ్రాల, నేఁగుదెం
చెడిని బసిండిమూడలను జెందినజంగమకల్పకంబు నాన్. ౧౩

ఈయనకు అర్ఘ్యము!

ఉర్వశి.—[చెప్పినట్లు తెచ్చి] ఇదుగో, భగవంతునికి పూజ.

[అంతట నారదుఁడు ప్రవేశించును]

నారదుఁడు.—విజయము మధ్యమలోకపాలునికి.

రాజా.—[ఉర్వశిచేతినుండి అర్ఘ్య మందుకొని వంచి] భగవంతుఁడా, అభివాదనము చేయుచున్నాను.

ఉర్వశి.—భగవానుఁడా, ప్రణమిల్లుచున్నాను.

నార.—ఎడఁబాయనిదంపతుల రగుఁడు.

రాజా.—[ఆత్మగతము] అహో! ఇట్లగునా! [ప్రకాశము], కుమారుని కవుంగిలించుకొని వత్సా భగవానునికి నారదునికి ప్రణమిల్లుము.

కుమా.—భగవానుఁడా! ఔర్వశేయుఁడను ఆయువును ప్రణమిల్లుచున్నాను.

నార.—ఆయుష్మంతుఁడ వగుము.

రాజా.—ఇదె యాసనము, అలంకరింపవలయు.

[నారదుఁడు కూర్చుండును. అందఱు నారదునిపిమ్మటఁ గూర్చుండుదురు.

నార.—రాజా, మహేంద్రునిసందేశమును వినుము.

రాజా.—అవహితుఁడను.

నార.—ప్రభావదర్శి శతమఖుఁడు అటవి కేఁగ సంకల్పించుకొన్న నిన్ను ఇట్లు అనుశాసించుచున్నాఁడు.

రాజా.—ఏమి యాజ్ఞాపించుచున్నాఁడు?

నార.—త్రికాలదర్శులు మునులు ఆదేశించినారు—సురాసురసంగ్రామము కలుగ నున్న దని. నీవు నాకు యుద్ధములలో గడిదేరినసహాయుఁడవు. కావున, నీవు

ఇపుడు శస్త్రసన్న్యాసము చేయఁగూడదు. ఈయూర్వశియు యావజ్జీవము నీకు సహధర్మచారిణిగా నుండవలసినది.

ఉర్వశి.—[అపవారించి] అహో! నాహృదయమునుంచి శల్యము ఉద్ధృత మయినది!

రాజు.—ఇంద్రునిచేత నాథవంతుఁడను.

నార.—యుక్తము.

ఆ. నిర్వహించుఁ గాక నీకార్యమును వజ్రి,
యీవొనర్పు మతనియిష్టములను;
పెనుచుచుండు నినుఁడు వీతిహోత్రుని వెల్గు,
వీతిహోత్రుఁ డినుని వెల్గుఁ బెనుచు. ౧౨౮

[మింటివైపు చూచి] రంభా, కుమారునికి ఆయువునకు మహేంద్రుఁడు స్వయముగా పంపినయౌవరాజ్యాభిషేకసంభారములను తెండి.

[యథోక్తహస్తలు అచ్చరలు ప్రవేశింతురు.]

అచ్చరలు.—భగవంతుఁడా, ఇవుగో అభిషేకసంభారాలు.

నార.—భద్రపీఠమున ఆయుష్మంతుని కూర్చుండఁబెట్టుఁడు.

రంభ.—వత్సా, ఇటు. [కుమారునిఁ గూర్చుండఁబెట్టును.

నార.—[కుమారునిశిరమున కలశమును కుమ్మరించి] రంభా, కడమవిధానమును నెఱవేర్పుము.

రంభ.—[యథోక్తము కావించి] వత్స, భగవంతునికిన్ని అమ్మకూ నాయనకున్ను ప్రణమిల్లు. [కుమారుఁడు వరుసగా ప్రణమిల్లును.

నార.—నీకు స్వస్తి.

రాజు.—కులధురంధరుఁడవు కమ్ము.

ఉర్వశి.—నాయనను ఆరాధించేవాడవు కమ్ము.

[నేపథ్యములో వైతాళికులు]

ప్రథముఁడు.—విజయము యువరాజునకు.

తే. అజుని సురమౌని యత్రి, యా యత్రిని శశి,
శశిని సౌమ్యుఁడు, సౌమ్యు భూజానివోలె,
అయ్య ననుకరింపుము లోకహారిగుణత,
నెల్లయాశాస్యములకు మీయిల్లె యిల్లు. ౧౨౯

ద్వితీయుఁడు.—

ఉ. ఉన్నతులందు నీజనకుఁ డున్నతుఁ, డీవును నప్రకంప్యతన్
మున్నయి మేర దప్పనిసుపుత్త్రుఁడ, వీమిముఁ గొల్చు చిర్వురన్,
వన్నగ రాజ్యలక్ష్మి ప్రవిభక్త వహించెఁ దుషారశైలవా
రాన్నిధులందు వ్యాప్తి గొని రాజిలుగంగను బోలుభాగ్యమున్.

అచ్చరలు.—[ఉర్వశిని దఱిసి] ఆహాహా! పుత్త్రునియువరాజశ్రీచేతను భర్తతోటిఅవియోగంచేతను వర్ధిల్లుతున్నావు!

ఉర్వశి.—ఈయభ్యుదయం అందఱిదిన్ని, [కుమారుని కేలంగొని] వత్సా రా, మీ దొడ్డమ్మకు నమస్కారంచేయి. [కుమారుఁడు తేమను.

నార.—ఉండు, సమయాన అమెకడకు పోయెదవు.

క. నీయాత్మజుఁ డగునాయుని। శ్రీయువరాజత స్మరింపఁ జేయు నసురసర్వ
స్వాయకుచే సురసేనా। నాయకతం బూన్పఁబడుపినాకితనూజున్. ౧-౨౭

రాజు.—భగవంతునిచేత ఇట్లు అనుగృహీతుఁ డయినవాఁడు యోగ్యుఁడు కాకుండు టెట్లు?

నార.—నీకు పాకశాసనుఁడు ఇంక నేమిప్రియము చేయవలయును?

రాజు.—మఘవంతుఁడు నాకు ప్రసన్నుఁడై యుండఁగా అంతకన్న ఏమి కోరుదును. అయినను ఇట్లగుఁగాక.

[భరతవాక్యము.]

క. సిరికి సరస్వతికిఁ బర।స్పరవిద్వేషిణుల కేకసంశ్రయమునయుం
దరు దగుసంగతి తఱచై। పొరయించును గాత సాధువుల కుదూభూతిన్.

మఱియు —

క. ఎల్లరు నిడుమలు గడచుత, మెల్లరుఁ గల్యాణముల రహింతురు గాతన్,
ఎల్లరకోర్కులు దీఱుత, మెల్లరు నందింత్రు గాత మెల్లధరిత్రిన్. ౧-౨౮

పంచమాంకము సమాప్తము.

విక్రమోర్వశీయనాటకము సమాప్తము.

---

చెన్నపురి : వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1921.

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 103 B 129 |
| పుస్తకం పేరు | ఆంధ్ర - [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | , D |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Ruksana |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |